# బంగారు నావ

మూలం :

**Tagore's 'Golden Boat'**

అనుసరణ :

గొడవర్తి సూర్యనారాయణ

# మనవి

రవీంద్రులు విశ్వకవిగా ఎంతటి లబ్ధ ప్రతిష్ఠులో కమనీయ కథకులుగా అంతటి యశస్సును సంతరించుకొన్నారు. వారి కథలకున్న ప్రశస్తియే వారి కథానికలకును ఉన్నది. వారు వంగభాషలో రచించిన కథానికలను బాభినీ భట్టాచార్యులవారు ఆంగ్లంలోకి అనువదించారు. కథానికాగుచ్ఛానికి నామకరణ సందర్భంలో రవీంద్రులు 'Silhouettee' అంటే సబబుగా ఉంటుందేమో అన్నారట. భట్టాచార్యులవారు 'Golden Boat' అంటే బాగుండదా అన్నారట. రవీంద్రులు సరే అన్నారట. దానిని బంగారు నావ అన్న పేరుతో నేను అనువదించాను. 1955 లోనే అనువదించటం జరిగినా ఇప్పటికిగాని దీనికి ప్రచురణ యోగ్యత అబ్బలేదు. ఈ అనువాదానికి అనుమతించిన శ్రీ బాభినీ భట్టాచార్యులవారికి కృతజ్ఞతా పూర్వక వందనాలు సమర్పిస్తున్నాను. ముఖచిత్రం అత్యంత ఆదరంతో రమణీయంగా వ్రాసియిచ్చిన సహోద్యోగి ప్రముఖ చిత్రకారుడు అయిన వీటూరి హరిశ్చంద్రశర్మగారికి నా కృతజ్ఞతాభినందనలు. అచిరకాలంలో ముద్రించియిచ్చిన మురళీ ముద్రాపకులకు అభినందనలు. దీని నాదరించిన అభిమానులందరకు కృతజ్ఞుడను.

సూర్యనారాయణ

# విషయ సూచిక

# 1. సంక్రాంతి

అందరికీ సంతోషం కలిగించే సంక్రాంతి పండుగ వచ్చింది. ప్రజలు వేడుకగా బొమ్మల కొలువు సాగించారు. నగర మొగసాలలో కూడా ఎప్పటివలెనే బొమ్మల కొలువు ఏర్పాటు చేశారు. కోటలో అపూర్వ సుందరాలైన బొమ్మలకు బహుమతులివ్వడం రివాజు. ఆ ఏడు కూడా అంతఃపుర రాజశిల్పికే బహుమతి లభించింది. ఇలా ప్రతిసంవత్సరం తన శిల్పసౌంద ర్యానికి బహుమతులందుకొంటూ ఆ రాజశిల్పి వృద్ధుడైనాడు.

వృద్ధశిల్పిస్థానే కిరీటి అనే ప్రతిమాశిల్పి శిల్పరంగ ప్రవేశం చేశాడు. అతడు నూనూగుమీసాల నూత్నయవ్వనుడు. అతని శిల్పం సరికొత్తది. అతని బొమ్మలలో అతిరూప శిల్పి విన్యాసం కాని, జిగిబిగువులుకాని, నగిషీనాణ్యాలుకాని, వన్నె చిన్నెలుకాని వృద్ధశిల్పిని మించిలేవు. కాని అతడు బొమ్మలకు వేసే రంగుల మేళవింపు, సరికొత్తగా అభిరుచి జనకంగాఉండేది. పడుచు వారందరూ వాటిని మెచ్చుకొని అతణ్ణి పొగిడేవారు. వృద్ధులు మాత్రం ఆతని ఔద్ధత్యానికి అసహ్యించుకొనేవారు.

కాలాన్నిబట్టి అభిరుచులు మారుతాయి కదా ! రాచ కన్నెల దృష్టి కిరీటి బొమ్మలవైపు ప్రసరించేది. వృద్ధ దాదులు మందలించారు కాని లాభం లేకపోయింది. వారి మంకు పట్టు వారిది.

వృద్ధుడుకూడా బొమ్మల కొలువుకు బొమ్మలు తయారు చేస్తూనే ఉండేవాడు. కాని అవి జనాకర్షణీయంగా ఉండేవి కాదు. ఒకప్పుడు జనంతో కిటకిటలాడే ఆతని బొమ్మలకొలువు ఇప్పుడు నిరాదరణీయమైంది. అతని ప్రతిమా శ్రేణి నిశ్చలంగా ఉండి నదిని దాటడానికి నావకోసం ఎదురుచూసే ప్రయాణీకుల బారుల మోస్తరుగా నిలిచి ఉన్నది. రెండుసంవత్సరాలు గడచి నాయి. వృద్ధుణ్ణి స్మరించిన వారెవ్వరూ లేరు. రాజమందిర ప్రాంగణంలో కిరీటికి ఎవ్వరూ ప్రత్యర్థిగా నిలవలేక పోయి నారు.

వయస్సుకుతోడు నిరుత్సాహము వృద్ధుణ్ణి క్రుంగ దీసింది. అతనికి బ్రతుకే భారమైంది. అతని ఒక్కగానొక్క కూతురు అతనివద్దకు వచ్చి "నాయనా! జీవితశేషం నాదగ్గర సుఖంగా గడుపుకో!" అని తన ఇంటికి తీసుకొనివెళ్ళింది.

అల్లుడు మట్టి దీపపుప్రమిదలను అమ్మి జీవనము సాగించే వాడు. కూతురు ఇంటిపనుల్లో మునిగి ఉండేది. వృద్ధుడు మనుమరాలితో ఆడుకొంటూ ఉండేవాడు. బాలికకు పదహారు ఏండ్లు వచ్చినా తాతదృష్టిలో మాత్రం ఇంకా పసిపాప. కాలంలో వచ్చిన మార్పు నతడు గుర్తించనేలేదు. చేనిదగ్గర పంటకు కాపరిగా ఉండి పిట్టలుతోలే తాత మెడలమీద మనుమరాలు స్వారీ చేసేది. ఒకనాడు వారిద్దరికి సంభాషణ ఇట్లా సాగింది.

"తాతా! నాకు సంక్రాంతికి ఒక బొమ్మ చేసిపెట్టవా?"

"నా బొమ్మలు మీకు నచ్చవుగా?"

"నీకంటె అందంగా చేసేవారెవ్వరు?"

"కిరీటి!"

"కిరీటియా! ఛీ! ఛీ!"

అతణ్ణి గురించి వాదోపవాదాలు జరిగినాయి. చివరకు వృద్ధుడు తన అభిమానవృత్తిని ఆరంభించాడు. పాతపనిముట్లకు, కుంచెలకు, మట్టిసుద్దలకు, సులోచనాలకు పనితగిలింది. "అమ్మా! పిట్టలు కంకులమీద వాల్తాయి! జాగ్రత్త!"

"నేను బెదరకొడతానులే! భయంలేదు." సాయంకాల మయ్యేది. ఆవుల అంబారావాలు మెడమువ్వల మోతలు విన బడేవి. అయినా ఆమె వడిసెల విసురులకు విసువులేదు. ఆయన బొమ్మల విరుపులకు, మలుపులకు అంతులేదు. ఇలా రోజులు సాగిపోతుండేవి.

ఒకనాడు కూతురు తండ్రిదగ్గరకు వచ్చింది. "నాన్నా! సుభద్ర ఈడేరిన పిల్ల. ఇహ ఇంటిపనులు చూడాలి! ఇంకా పాపాయి మోస్తరు బొమ్మలాట లాడటానికి వీలులేదు. నీవే దానికి సగం అలుసిస్తున్నావు" అన్నది.

"కాదా మరి! కాని ఈ బొమ్మలు రాచబిడ్డలకోసం తయారు చేస్తున్నానమ్మా!"

"సుభద్ర పెళ్ళి చదివింపులకు నాలుగు కాసులు వస్తా యేమో అని ఆశ! అంతేకాదు?" అన్నది.

"ఈబొమ్మలను ఎవరు కొంటారు?" అన్న ఆ ధ్వనిలోని నీరసాన్ని గ్రహించి వృద్ధుడు తలవంచుకొన్నాడు.

ఇంతలో సుభద్ర వచ్చి "ఎలా కొనరో చూస్తాను." అని వెళ్ళిపోయింది.

రెండు రోజులు గడచినాయి. సుభద్ర ఒక బంగారు నాణెము అమ్మచేతిలో పెట్టి "ఇది అంతా తాత బొమ్మల బాపతు" అన్నది.

"ఎవరిచ్చారు?" అన్నది తల్లి.

"రాచనగరులో" అని సుభద్ర సమాధానం ఇచ్చింది. వృద్ధుడు నవ్వి "చూశావా? చత్వారముకాని వణకుగాని లేక పోతేనా" అని అర్ధోక్తిలో ఆగిపోయాడు. "ఇలాంటివి పదహా రయితే చిట్టితల్లి మెడలోకి ఒక ముచ్చటయిన హారం వస్తుందని" తల్లి మురిసిపోయింది. "దిగులు పడవద్దు. త్వరలో హారం వస్తుం దని" వృద్ధుడు అభయహస్తమిచ్చాడు.

"వరుని కూడ చూడనక్కరలేదు! నాకు" అని తాత చెవిలో ఊదింది. వృద్ధుడు ఒక ఆనందబాష్పము విడిచాడు.

వృద్ధుడు నూత్నయవ్వనుడైనాడు. మునిమాపున కాకులు గూళ్ళుచేరేదాకా, ఆవుల చిరుమువ్వల మోతలు వినపడేదాకా చెట్టుకింద బొమ్మలు తయారుచెయ్యటం తాతవంతు. పిట్టలను తోలటం సుభద్రవంతు.

మళ్ళీ సంక్రాంతి వచ్చింది. ఒకొటొకటిగా పదహారు బంగారునాణాలు సమకూరడం సుభద్ర మెడలోకి అందమైన హారం చేయించడం జరిగింది.

"ఇహ పెళ్ళికొడుకు ఒకడే తక్కువ" అనుకొన్నది తల్లి.

"దగ్గరలోనే ఉన్నాడు" అని తాత చెవిలో ఊదింది మనుమరాలు. విప్పారిన కళ్ళతో "ఎక్కడ తెచ్చుకొన్నావే మచ్చెకంటీ!" అని తాత ప్రశ్నించాడు. సుభద్ర తన కథ ఇలా చెప్పింది. "ఒకనాడు రాచమందిరానికి వెళ్ళాను. 'ఎందుకొచ్చావు?' అని దవ్వారికుడు ప్రశ్నించాడు. 'బొమ్మలను అమ్మడానికి వచ్చాను' అన్నాను. 'అవి రాచకన్నెలకు తగినవి కావుపో!' అన్నాడు. కళ్ళనీళ్ళు కళ్ళలో కుక్కుకొని తిరిగివస్తున్న నన్నుచూసి ఒకాయన నన్ను ఆపి 'ఆ బొమ్మల అంగీలు కొంచెము మారిస్తే; తప్పక అమ్ముడుపోతై' అని, అతడు వాటిని సవరించాడు. తాతా! నీకు నచ్చితే ఆయనను వివాహమాడతాను." "ఇప్పుడు అతడు ఎక్కడున్నాడు." అని తాత ప్రశ్నించాడు. "అడుగో ఆ రావిచెట్టుకింద". అంతలో యువకుడువచ్చి తాతగారికి పాదాభివందనము చేశాడు. వృద్ధుడు అతణ్ణి లేవనెత్తి ఎగాదిగాచూసి "నీవు కిరీటివి కాదూ!" అన్నాడు. "అవును" అన్నాడు కిరీటి. తాత తన్మయుడై "పూర్వం నా బొమ్మలను అపహరించావు. ఇప్పుడు నా రతనాల బొమ్మను అపహరించటానికి వచ్చావు దొంగా" అన్నాడు.

సుభద్ర తన చేతులను తాతమెడకు పెనవైచి "తాతా! నాతో కూడా నిన్ను అరణంగా తీసుకుపోవడానికి బేరమాడేనులే" అని చెవిలో ఊదింది.

—*Tagore: 'New Dolls and old'*

# 2. పద్మారాధన

సుదాముని పద్మాకరంలో పద్మాలన్నీ మంచుకు దళాలు విడిపోయి శోభావిహీనాలై ఉన్నాయి. శతపత్రి మొక్కటే అందంగా ఉన్నది. సుదాముడు దాన్ని భద్రంగా కోసి విక్రయానికి రాచనగరుకు తీసుకొని పోతున్నాడు.

రాజమందిరద్వారంలో వణిజశ్రేష్ఠు డొకడెదురైనాడు. అతడు పద్మాన్ని చూచి ముచ్చట పడ్డాడు. 'మాలీ! నగరంలో శాక్యముని వేంచేసి ఉన్నారు. వారి పాదసన్నిధిని సమర్పించడానికి ఇది అన్నివిధాలా యోగ్యంగా ఉంటుంది. తీసుకొంటాను. వెలచెప్పు' అన్నాడు. 'ఒక దీనారం దయచెయ్యండి' అన్నాడు మాలి. ధనంకోసం అతడు జేబుతడుముకొంటున్నాడు. ఇంతలో బుద్ధభగవానుని సందర్శనార్థం రాచనగరునుంచి బయలుదేరిన మహారాజు అక్కడికి రావడం తటస్థించింది. ముద్దులు మూటకడుతున్న శతపత్రిశ్వేతపద్మాన్ని చూడగానే రాజు ఆశ్చర్య చకితుడైనాడు. 'బుద్ధదేవుని పాదపద్మారాధనకు ఇది చాలా యోగ్యమైంది' అనుకొన్నాడు. 'వనమాలీ! దీని వెల ఎంత?' అన్నాడు. 'ఒక దీనారానికి అమ్మినాను ప్రభూ!'

అన్నాడు సుదాముడు. రాజు 'నేను పది దీనారాలిస్తాను' అన్నాడు. 'నేను ఇరవై ఇస్తా' నన్నాడు వర్తకుడు. ఆధిక్యత కోసం, పరువు ప్రతిష్ఠలకోసం వారిలో స్పర్థ హెచ్చింది. ఎలాగైనా పద్మాన్ని కొని భగవానుని కర్పించాలన్న పట్టుదల తప్ప వారి దృష్టిలో దీనారాలకు విలువలేదు. ఈ స్పర్థలో ధర ఆకాశం అంటింది.

తదేకధ్యానంతో దీన్నంతా చకితుడై చూస్తున్న సుదాముని కొక కోరిక కలిగింది. 'వారి గురుదేవులకోసం వారు ఇంతగా పోటీపడుతున్నారు! స్వామిదగ్గరకు నేనే స్వయంగా తీసుకొనిపోతే ఇంతకు రెట్టింపు వస్తుందేమో' అనుకొన్నాడు. చేతులు రెండూజోడించి వారిద్దరినీ చూసి 'క్షమించండి. ఈ పుష్పాన్ని నేను విక్రయించను' అని భద్రంగా దాచుకొని గురుదేవుల దగ్గరకు త్వరితగతిలో నిష్క్రమించాడు.

పద్మాసనస్థుడై బ్రహ్మతేజస్సుతో వెలుగొందుతున్న బుద్ధభగవానుని వదనంలో శాంతం వెల్లివిరుస్తున్నది. లోక సమ్మోహనమైన ఆ మూర్తిని చూడడంతోనే సుదాముడు నిస్తబ్ధుడైనాడు. అచేతనస్థితిలో ఒక క్షణం అలాఉండి బుద్ధదేవుని పాదపద్మాలకు ప్రణమిల్లి తాను తెచ్చిన శతపత్రి పద్మాన్ని స్వామి చరణకమలాలకు సమర్పించాడు.

క్షణం సేపటికి శాక్యర్షి దరహసిత వదనంతో చల్లని చూపుతో 'నాయనా! ఏంకావాలి?' అన్నాడు. సుదాముడు సకౌతుకంగా 'ప్రభూ! తమ పాదధూళి ఒక పిడికెడుతప్ప ఈ దీనుడాశించేది ఏమీ లేదు' అన్నాడు.

—*Tagore; 'Lotus offering'*

# 3. పాణిగ్రహణం

సాయంకాలమైంది. రాజకుమారుడు కల్యాణవేదికను అలంకరించాడు. శంఖానాద మేళతాళధ్వనులు మిన్నుముట్టుతున్నాయి. బయటి నిరంతర వర్ష ధారల ధ్వనిగాని, మేఘనిర్ఘోష ధ్వనులుగాని సదస్యులకు వినిపించడంలేదు. కల్యాణమంటపంలో దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

ముత్తైదువల హాసపరిహాసాలకు అంతులేదు. మురిపాలతో ముచ్చట్లతో, పాటలతో పురోహితుల మంత్రాలతో పెండ్లి పెద్దల ఆశీర్వాదాలతో, మేళతాళాలతో పెండ్లిపందిరిలో కోలాహాలం మిన్నుముడుతున్నది.

నూతన వధూవరుల చెంగులు మూడుముళ్ళు పడ్డాయి. తలబ్రాలు వంతులతో ముచ్చటగా ముగిసినాయి. సదస్యులు ఆడా మొగా అంతా ఆశీర్వచన పరంపరలతో అక్షతలు చల్లారు.

ఇంతలో పిడుగుపడ్డట్టు ఆర్తారావము సైనిక శంఖారావము వినపడ్డాయి. యోధుడొకడు నిట్టూర్పులతో సభామంటపం ప్రవేశించాడు. 'దుష్టులు, దురాశాపరులు అయిన

రాజద్రోహులు నగరాన్ని ముట్టడించారు! రాణా రామ సింహులు యుద్ధోన్ముఖులైనారు! మీ సహాయమర్థిస్తున్నారు! రాజపుత్రులైన వీరులందరు రణరంగానికి ఉరకవలసిందిగా ఆయన ఆదేశము!' అని ఒక్క బిగిలో పలికి రాణారామసింహు నకు జయమగుగాక అని జయజయ ధ్వానంచేశాడు. వెంటనే ఆవేశపూరితుడైన నూతనవరుడు రాణారామసింహునకు జయ మగుగాక అని ప్రతిధ్వానం చేశాడు. నూతన వధువుకు గుండె ఝల్లుమన్నది! శరీరంఅంతా కంపించింది! నేత్రాలు బాష్పాలతో నిండినై.

రాజపుత్రులైన వారంతా రండని యోధుడు మేఘ నాదంచేస్తూ మేవారుయువరాజా! క్షణమైనా జాగుచెయ్యకుండా రావలసిందని వాయువేగంతో వెళ్ళిపోయాడు.

కల్యాణమంటపం కళావిహీనమైంది. తూర్యధ్వనులన్నీ చప్పబడి అంతరించాయి. యువరాజు తన మధుపర్కాన్ని సడలించాడు. నూతన వధువు దగ్గరకువెళ్ళి 'కుమారీ! శుభమగు గాక! యుద్ధాహ్వానం వచ్చింది. జయమో మృత్యువో తథ్యం!'

స్వర్ణరంజితాలైన ఆ మధుపర్కాలతోనే రాకుమారుడు కృపాణపాణియై అశ్వారోహణం చేసి యుద్ధరంగానికి శర వేగంతో వెళ్ళిపోయినాడు.

నూతన వధువునుచూచి తల్లిగుండె పగిలింది. కంట నీరు పెడుతూ 'దురదృష్టవంతురాలా! నీ కర్మమిట్లా కాలింది! ఆ పసుపుబట్టలు అవతల పారవెయ్యి!' అన్నది. కాని వధువు 'అమ్మా! అలాగే ఉండనీ! నేను మేవారుచేరి ప్రాణేశ్వరుడు తిరిగి వచ్చేదాకా నిరీక్షిస్తాను!' అన్నది.

నవవధువు పల్లకీ ఎక్కి బయలుదేరు సమయంలో 'దీర్ఘ సుమంగలీభవ!' అని చేసిన బ్రాహ్మణాశీర్వాదము మిన్ను ముట్టింది. అందాలరాశిగా అందలం అటూఇటూ తూగుతూ సాగిపోయింది.

పల్లకీ మేవారు నగరప్రాంతం చేరుతుండగా 'ఎవరా సంగీతం పాడేది? ఆపండి! ఇది సంగీతాలకు సరససల్లాపాలకు సమయం కాదు! యువరాజు యుద్ధంలో హతుడైనాడు! దహన సంస్కారాలకు మేమిక్కడ చేరినాము' అన్న పిడుగువంటి వార్త వినపడ్డది.

వధువు పల్లకీ దిగి శ్మశానం ప్రవేశించింది. శంఖాలు పూరించండి! మేళతాళాలు మ్రోయించండి! పాణిగ్రహణం పూర్తి కావలసి ఉన్నది! బ్రహ్మముడి తిరిగి వేయాలి! అని మధు పర్కాలతో శోభిస్తూ రక్తసిక్తమై కాష్ఠశయ్య మీద ఉన్న మేవారు రాజపుత్రుని శవందగ్గర చేరింది. మిథునబంధం తిరిగి ముడివేసింది. తన తొడమీద అతని శిరస్సు ఉంచింది. జీవరహితమూ, శీతలమూ అయిన ఆ ముఖచంద్రునిమీద ఒక ముద్దు ఉంచింది. అదే తుదీ మొదలూ!

'మృత్యుంజయులైన మీరు మృతజీవులు!' అని బ్రాహ్మణాశీర్వాదం జరిగింది.

నీలలోహితుడైన వైశ్వానరుడు తన వేయిముఖాలతో ఆ జంటను చూశాడు. పాణిగ్రహణం పరిపూర్ణమైంది.

—*Tagore: 'Wedding'*

# 4. మూర్ధన్యుడు

కోసలప్రభువు సుకృతముల పంట. అతడు ఆర్తత్రాణ పరాయణుడన్న కీర్తి దశదిశలవ్యాప్తి చెందింది. అది కాశీరాజుకు సహింపరానిదైంది. ఇది తెవులులేని వేదన గదా!

'నా కంటె అతడే గొప్పఅని నా ప్రజలుకూడా నమ్ముతున్నారు. తన కపట దానశీలంతో అతడు ప్రపంచాన్నే మోసగిస్తున్నాడు' అని నిరంతరం భావించడంచేత కాశీరాజుకు ఆవేదన భరింపరానిదైంది. 'మా ఇరువురిలో ఎవరు మహితాత్ములో కరవాలమే నిర్ణయిస్తుంద'ని కాశీరాజు సైన్యాయత్తుడై రణభేరి మ్రోగించాడు.

యుద్ధం ముగిసింది. పరాజితుడైన కోసలేంద్రుడు అడవుల పాలైనాడు. దుర్దాంతమైన పరాక్రమం ఉన్న రాజులలో వదాన్యత రాణిస్తుందిగాని అడవులకు పలాయన మంత్రం పఠించేవారిలో ఏమి రాణిస్తుందని కాశీరాజు ఆత్మలో తృప్తి పడ్డాడు.

ప్రజానీకం దుఃఖంలో మునిగిపోయింది. 'ధర్మప్రభువులు దారుణహింసకు పాలైనారు. ధర్మం నశించింది. ప్రపంచవిలయం రావడం తథ్యమ'ని ప్రజలు ఉద్ఘోషించడం మొదలు పెట్టారు.

ఇది విన్న కాశీరాజు క్రోధోద్రిక్తుడైనాడు. 'ఈ అవివేకులు కోసలరాజుకోసం పలవిస్తారెందుకు? ప్రభువునైన నన్ను మన్నించి గౌరవించరేం? ఇది కూడా ఆయన మంత్రాంగం కాదుకదా! పరాజయంపొందిన రాజు ఈ మార్గంలో జయాన్ని కాంక్షిస్తున్నాడా?' అన్న అనుమానం కాశీరాజులో బయలు దేరింది. అమాత్యునికి కబురంపాడు. 'కోసలరాజును ప్రాణాలతో బందీగా తెచ్చినవారికి నూరు హేమనిష్కాలు బహుమానమని రాజ్యంలో చాటించు' అని ఆజ్ఞాపించాడు.

రాజభటులు రాజాజ్ఞను గ్రామగ్రామంలో చాటించారు. ప్రజలా ప్రకటనవిని చెవులుమూసుకొని 'హరిహరీ' అని తొలగిపోసాగారు.

పరాభూతుడైన కోసలేంద్రుడు రాజయోగిగా ఏకాకిగా వనాల్లో సంచరిస్తున్నాడు. ఒకనాడొక బాటసారి ఆయన దగ్గరకు వచ్చి 'వనవాసీ! కోసలదేశానికి దారిచూపగలవా?' అని అడిగాడు.

'మిత్రుడా! కోసలదేశానికి ఎందుకు వెళుతున్నావో అడగవచ్చునా?'

'విను. నేనొకవైశ్యుణ్ణి. నౌకావ్యాపారం చేస్తుంటాను.

ప్రస్తుతం నా నావఒకటీ తుఫానులో చిక్కుకొన్నది. చేతిలో ఎట్టిని ఏగానిలేని దీనావస్థలో ఉన్నాను. కోసలరాజు ఆర్త త్రాణ పరాయణుడని విన్నాను. కరుణామూర్తి అయిన ఆయనకు నా ప్రస్తుతస్థితి జాలిని కల్గింపకపోదని నా ఆశ!'

బాష్పాలతో నిండిన కళ్ళను రాజయోగి ఒక లేత నవ్వుతో కప్పిపుచ్చుకొన్నాడు. క్షణం ఆలోచనా నిమగ్నుడై ఒక్క నిట్టూర్పు విడిచాడు. అతణ్ణిచూసి 'మిత్రుడా! రా! నీ అభిమతం తీర్చేవారి దగ్గరకు తీసుకుపోతాను' అని బయలు దేరాడు.

వర్తకునితోబాటు కోసలేంద్రుడు రాజసభ ప్రవేశించి కాశీరాజుకు నమస్కారం చేశాడు. 'నేను కోసలపతిని. నన్ను మీ దగ్గరకు ప్రాణాలతో బంధితునిగా తెచ్చినవారికి నూరు బంగారు నిష్కాలు ఇస్తామని ప్రకటించారు. ఇడుగో ఇతడు నా సహచరుడు. ఇతనికి ఆ బహుమతి ఇచ్చి మీ ప్రతిజ్ఞ పాలించండి!' అని నిశ్చలంగా నిలబడ్డాడు.

రాజసభ సంతోష సంభ్రమాశ్చర్యాలతో నిండిపోయింది. ఖడ్గపాణులు, తదితర శస్త్రజీవులు తమ ఉద్వేగాన్ని అణచుకొన్నారు.

కాశీరాజున కిది కశాఘాతమైంది. కర్తవ్యం తెలియక కొంతసేపు నివ్వెరపోయినాడు. చివరకు సింహాసనంనుంచి లేచి 'రాజబంధితుడా! మృత్యుముఖంలో నన్ను జయించాలను కొన్నావా? నీ ఆశను నిరాశ చేస్తాను. ఈనాడుకూడా విజయం

నాదే' అన్నాడు. మళ్లీ ఒక క్షణం యోచించాడు. ముఖం ప్రసన్నమైంది. సానుతాపంగా కోసలేశ్వరుని సమీపించాడు. 'కోసలమహారాజా! ఈ కోసలను, దానితోబాటు నా హృదయాన్నికూడా పాలించు!' ఇలా అంటూ రాజయోగిని సింహపీఠికదగ్గరకు చేర్చి 'ధూళిధూసర పరివ్యస్తాలకోపేతమై'న అతని శిరస్సున నవరత్నఖచిత కిరీటాన్ని అమర్చాడు. జయజయధ్వానాలతో సభ ప్రతిధ్వనించింది.

*—Tagore: 'Price of a head'*

# 5. గురుగోవిందుడు

సిక్కులనాయకుడైన గురుగోవిందుడు పతనంచెంది తన పూర్వచరిత్రను స్మరించుకొంటున్నాడు. యౌవనంలో ఆయన స్వప్నాలన్నీ భగ్నరాశులైనాయి.సందేహాసంప్రశ్నలతో ఆయన హృదయం వ్యధితమౌతున్నది. నిరాశతప్ప తాను సాధించింది ఏమీ లేదుకదా అని హతాశుడై, శూన్యదృష్టితో బయలు ఆలకిస్తున్నాడు.

ఇంతలో పఠాన్‌వంశీయు డొకడు ఆవేశపూరితుడై వచ్చి గుఱ్ఱంకోసం ఇచ్చిన అరువు సొమ్ము ఇవ్వవలసిందిగా అతణ్ణి నిర్బంధించాడు. 'తమ్ముడా ఈనాటికి నన్ను వదలిపెట్టు. రేపు తప్పక చెల్లిస్తాను' అని గోవిందుడు సౌమ్యంగా అన్నాడు. పఠానుడు కర్కశంగా 'ఈరోజు ఇయ్యక తప్పదు!' అని అతని చేయిపట్టుకొని 'ఎంతకాలం ముఖం తప్పించుకు తిరుగుతావు చోరుడా!' అని కసురుకొన్నాడు.

చోరశబ్దం చెవినిపడగానే వల్మీకంనుంచి సర్రున లేచిన మహానాగం మోస్తరు గోవిందుని ఒరనుంచి ఖడ్గంవచ్చి మెఱపు

వలె ఒక్కసారి మెరిసింది. మరుక్షణంలో పఠానుడు రక్తసిక్తాంగుడై నిర్జీవుడై నేలమీద పడిఉన్నాడు.

క్రోధంలో అంధుడై తాను చేసిన దుష్కార్యానికి గోవిందుడు పరితాపం చెందసాగాడు. 'నిష్కారణంగా రక్తపాతం చేశాను! నాకు నిష్కృతిలేదు! జీవితశేషం పాపపరిహారం పొందాలి' అని పరితపించాడు.

మరణించిన పఠానుపుత్రుణ్ణి తెచ్చి పుత్రసమునిగా పెంచడం మొదలుపెట్టాడు. అస్త్రవిద్యలో అతణ్ణి అసామాన్యమైన పండితుణ్ణిగా తయారుచేశాడు.

'అయ్యో! మాకు భయంగా ఉన్నది. ఎవరైనా పులిపిల్లను తెచ్చిపెంచుతారా? ఇతడు పెరిగిపెద్దవాడైతే తండ్రి మోస్తరుగానే తయారౌతాడు' అని గోవిందుని మిత్రులు ఆశంకించారు.

'పులిపిల్లను పులిపిల్ల మోస్తరుగా పెంచకపోతే నా శిక్షణలో ప్రయోజనం ఏముంది?' అని గోవిందుడు సమాధానించాడు. బాలుడు పెరిగి పెద్దవాడైనాడు. అతడు గోవిందుని తండ్రిగాభావించి ప్రేమించి నీడవలె సంచరించేవాడు. గోవిందుని పుత్రులందరూ యుద్ధంలో మరణించారు. పఠానుయువకుడు పుత్రస్థానం ఆక్రమించాడు.

పఠాన్ యువకుడు ఒకనాడు గురుని పాదాలకు ప్రణమిల్లి 'మీ దయవల్ల అస్త్రవిద్యావంతుణ్ణి అయినాను. జీవనోపాధికి రాచకొలువులో శస్త్రజీవిగా చేరడానికి అనుమతించండి' అని వేడుకొన్నాడు.

'ఖడ్గహస్తుడవై నా వెంటరా! నిన్ను పరీక్షిస్తాను' అన్నాడు గోవిందుడు.

ఇద్దరూ మౌనంగా ఒక అడవిదాటి ఒక సెలయేటిని సమీపించారు. నీరు నిర్మలంగా స్ఫటికం మోస్తరు ప్రకాశిస్తూ మోకాలిలోతులో ప్రవహిస్తున్నది. ఆకాశం మేఘావృతమై ఉన్నది. గోవిందుడు పఠానును చూసి 'మహమ్మద్! వచ్చి ఇక్కడ తవ్వు' అని శాసించాడు. ఇసకలోనుంచి కారురాయి ఒకటి బయటకు వచ్చింది. గోవిందుడు దానిని మహమ్మదుకు చూపి 'చూశావా ఈ నెత్తుటి మరకలు! ఇది నీ తండ్రి రక్తము! అతడు నాకు గుర్రాన్ని అప్పుగా ఇచ్చాడు. బదులు తీర్చడానికి బదులు ఆయనను నేను ఇక్కడే వధించాను. మహమ్మద్! నీ తండ్రి పవిత్రాత్మ శాంతికోసం ఆ పరిభవదాహాన్ని రక్తపానంతో తీర్చుకో!'

కోపోద్దీపితుడైన పఠాను కరినిలంఘించే సింహకిశోరంలా ఆతని మీదకు దూకాడు. గోవిందుడు దరహసితవదనంతో శాంతంగా నిశ్చలంగా కూర్చొన్నాడు. పఠానుడు చేతికత్తిని దూరంగా విసిరివేసి గోవిందుని పాదాల మీద బడి 'నా తండ్రి హత్యను ఏనాడో మరచిపోయాను. మరణించిన నా తండ్రివలెనే నిన్ను కూడా ప్రేమించడం మొదలు పెట్టాను. నిద్రించిన రోషమహానాగాన్ని ప్రకోపింపజెయ్యకండి. దాని నలాగే కృశించి చావనియ్యండి.' అని దుఃఖించాడు.

ఆనాటి నుంచి పఠాను డాతనికి ఎడ ఎడంగా సంచరించడం మొదలుబెట్టాడు. పఠాను గోవిందుని దగ్గరకు ఖడ్గధారియై రావడం మానేశాడు.

ఒకనాడు సాయంకాలం గోవిందుడు మహమ్మదును చదరంగానికి ఆహ్వానించాడు. పఠానుడు ఆటవెంబడి ఆట ఓడి పోయాడు. మరో ఆటలో ఎత్తుకోసం దీర్ఘాలోచనలో పడ్డాడు. గోవిందుడు అవహేళనగా అతణ్ణి చూసి 'పితృహంతకునితో చదరంగమాడే పిరికిపందకు ఓటమిదప్ప జయం ఎందుకు కలుగుతుంది?' అని పావు తీసుకొని అతని తలమీద విసరి వికటంగా నవ్వాడు.

రోషానలం దహించుకు పోతున్న మహమ్మదు పక్కనే ఉన్న కరవాలాన్ని చట్టున పెరికి గోవిందుని హృదయంలో దింపాడు.

మరణాసన్నుడైన గోవిందుడు మందస్మితంతో 'నాయనా! యోధునివలె పగదీర్చుకోవడం ఈనాటికి నేర్చుకొన్నావు' అని తలవాల్చాడు.

—*Tagore : 'Gurugovind'*

# 6. వింత భిక్షువు

కషాయ కాంతులతో తూర్పుదిశ అరుణరంజితమైంది. సామ్రాజ్య మహానగరమైన శ్రావస్థి నగరము ఇంకా నిద్రలో మునిగేఉన్నది. గూళ్ళనుండి అప్పుడప్పుడే పక్షుల కిలాకిలా రావాలు వినవస్తున్నాయి. ఆ వేకువ సమయంలో బౌద్ధభిక్షువు ఒకడు 'బుద్ధంశరణంగచ్ఛామి' అన్న ధర్మత్రిపుటిని ఉచ్చరించి పౌరులనుద్దేశించి "పౌరులారా! మీకున్నదానిని దానము చేయండి. మేఘుడు తనకున్న దాని నంతటిని దానం చేయడం లేదా? త్యాగానికి మించినధర్మంలేదు" అని దిక్కులు ప్రతిధ్వనించేటట్టు ప్రబోధం సాగించాడు. అప్పుడే హంసతూలికా తల్పంనుంచి లేచిన సార్వభౌముడు ఆ వాక్యాలు విని దీర్ఘాలోచనానిమగ్నుడై తన బలపరాక్రమాల నిష్ప్రయోజకత్వాన్ని ఊహించుకొన్నాడు. తమ జీవిత సర్వస్వాన్ని త్యజించాలన్న కాంక్ష ధనవంతులకు అకస్మాత్తుగా కలిగింది.

ఒకబాలిక నిష్కారణంగా కంటతడిబెడుతున్నది. జీవిత సౌఖ్యం సూత్రం తెగి చెల్లాచెదరై పాదాలక్రింద నలిగిన పుష్పాలవంటిదని ఆమెకు తోచింది.

ఆ మసకమసక వెలుగుల్లో మేడలమీది కిటికీల నుంచి వీక్షించే దంపతులకు బౌద్ధభిక్షువు నయనగోచరుడైనాడు. ఏకాకియై వీధులలో తిరుగుతున్న ఆ భిక్షువుముందు పౌరులు యథాశక్తి బంగారు నాణాలను, రత్నాలను సమర్పిస్తున్నారు. కాని అవిస్వీకరించక వారిని పంపివేస్తూ "పౌరులారా! మీకున్న దానిలో మెరుగైన దానిని స్వామికర్పించండి" అని మరో సారి హెచ్చరించాడు. సార్వభౌముడు, సంపన్నులు, వర్తక శిఖామణులు, వదాన్యులు, సిగ్గుతో తలలువంచుకొని వెనుదిరిగి పోయారు. ఒకరైనా భిక్షుకుని దృష్టిలో సముచితమైన కానుకను సమర్పింపలేక పోయినారు. నగరరాజంలో ఉన్న నగ దంతా తిరస్కృతమై భిక్షుకుని పాదాలముందు రాశిగా పడి ఉన్నది.

రాజవీధులు అన్నీ దాటి ఆ వింత భిక్షువు నిరుపేద లకు ఆటపట్టై చీకటి అలముకొని దుర్గంధభూయిష్ఠాలైన సందు గొందుల్లో ప్రవేశించాడు. ఆ భిక్షుకుని ఆదేశము విని ఒకపూరి గుడిసె నుంచి ఒక యువతి బయటకువచ్చి అతనికి సాగిల మ్రొక్కి పాదధూళి శిరస్సునదాల్చి 'క్షణమాగండి' అని ప్రార్థించి లోపలికి వెళ్ళింది. తలుపువెనుక దాగి జీర్ణమై ధూళి ధూసరితమై తాను ధరించిన చీరను విడచి ఆతనిపై విసరి వేసింది. ఆ నగ్నసుందరి గుమ్మము వెనుక దాగి యున్నది. భిక్షుకుని నేత్రాలు ఒక్కమారు మెరిశాయి. "మాతా! నీవే సుకృతివి! అఖండ సామ్రాజ్య సంపదను అంతటినీ మించిన

దానిని దానంచేశావు. ఇది శిరోధార్యం!" అని చెప్పి ఆ వస్త్రాన్ని కన్నుల కద్దుకొని తన నెత్తిపై పెట్టుకొని తన ప్రభువును సందర్శించటానికి వెళ్ళిపోయినాడు.

("అజరామరవత్ప్రాజ్ఞో విద్యామర్థంచ సాధయేత్
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్")

—*Tagore : 'Strange beggar'*

# 7. మీనాక్షి

మీనాక్షి కాపురానికి వచ్చిన కొద్ది కాలానికే ప్రథమ సంతానం మగశిశువు కలగడం పుట్టిన కొద్ది ఘడియలకే పోవడం జరిగింది. రెండో సంతానం ఆడపిల్ల అయినా సంవత్సరం తిరగ కుండానే గతించింది. ఆమె యువతి. వృంతాన్ని అంటిపెట్టు కొన్న కాయవలె, రెమ్మనంటుకొనిఉన్న పువ్వువలె సృష్టిమీద ఆమెకు ఎక్కువమక్కువ. జీవంఉన్న ప్రతిదాని మీదా ఆమెకు అనురాగంమెండు. హృదయం హత్తుకొంటుంది.

ఆమె ఉన్న కుటీరం వెనక ఒకపూలతోట ఉన్నది. దాన్ని ప్రాణం ఒక ఎత్తుగా చూసుకొనేది. వసంతం వచ్చింది. లతలన్నీ మొగ్గదొడిగాయి. ఇంతలో కలకత్తాలోఉన్న భర్త దగ్గర నుంచి ఆమెకు పిలుపువచ్చింది. పాపం మనస్సు చివుక్కుమంది.

కలకత్తాలో తమ నూతన నివాసం పరిసరాలలో ఉన్న పెంపుడు కుక్కలమీద ఆమెకు మక్కువగా ఉండేది. అన్నిటి కంటె 'జాకీ' మీద ఎక్కువమోజు. అది చూడ ముచ్చటగా ఉండేది. అది అంటే ఆమెకు పంచప్రాణాలు! దాని మెడలోకి ఒక ముచ్చటైన పూసల దండను స్వయంగా తయారుచెయ్యాలని

సంకల్పించింది. ఇంతలో వారు ఇంకో చోటికి మారవలసి వచ్చింది.

'జాకీ'ని తమ వెంట తీసుకొని పోవచ్చునని యజమాని కబురంపాడు. కాని 'ఈవెధవ కుక్కలు ఒక తగులాటం' అని భర్త తిరస్కరించాడు.

కొత్తచోటికి వెళ్ళిన నాటిరాత్రి మీనాక్షికి నిద్రపట్టలేదు. గుబులు గుబులుగా శయ్యమీద అటూ ఇటూ దొర్లుతూనే ఉన్నది. మనస్సు కలియ బెట్టినట్లైంది. ఇంతలో అరుణకాంతులు కిటికీనుంచి తొంగిచూశాయి. మీనాక్షి మోచేతులమీదపడుకొని అటూ ఇటూ చూసింది. తన గది మీదికి పెరిగిన చంపకలత పుష్పాలతో నిండి ఉన్నది. గంధవహుడు దగ్గరకువచ్చి 'మీనూ కుశలమా!' అని ప్రశ్నించినట్లనిపించింది.

రెండిళ్లమధ్య ఇరుకు సందులో ఉన్నతంగా పెరిగిన చంపకలత సూర్యరశ్మికి మూగబిడ్డ మోస్తరు కొట్టు కొంటున్నది. తన స్థానం అది కాదన్నట్లు అది పక్కలకు ఎగ బ్రాకుతున్నది. బాగా పొద్దెక్కితేగాని మీనాక్షి నిద్రలేవదు. ఆమెలేచేసరికి ఒక్క పువ్వుకూడా ఉండదు! పూలేమైనాయని ఆమె సందేహం! చెట్లకు పాదులుచేసి నీళ్ళుపోయవలసిందిగా మాలికి చెప్పింది. కాని లేచిచూసేసరికి పూలు కనబడలేదు. పుష్పాలేమవుతున్నాయో కొన్నాళ్ళ తరవాత గ్రహించింది.

అర్ధముకుళితపద్మాలవలె ప్రభాతవేళ సగం విడివడు తుండగానే బ్రాహ్మణభక్తుడొకడు పూలసజ్జతోవచ్చి, తనకు రావలసిన బాకీపై సలతోసహా వసూలుచేసే బాకీదారుని మోస్త రుగా, చెట్టునొక్కసారి కదలబారేటట్లు ఊపాడు. మీనాక్షి

పనిమనిషినిపిల్చి 'త్వరగా వెళ్ళి ఆయనను ఒకసారి పైకి తీసుకొనిరా' అని పంపింది. బ్రాహ్మణుడు రాగానే మీనాక్షి ఆయనకు పాదాభివందనంచేసి 'అయ్యా ఎవరికోసం మీరీపూలుకోస్తున్నారు?' అన్నది. 'నా ఇష్టదైవానికి' అని ఆయన అన్నాడు. 'కాని ఈ పుష్పాలు నాకు ఈశ్వరుడిచ్చాడని మీకు తెలియదా' అన్నది మీనాక్షి. 'మీకా'? 'ఔను! ఆయన వాటిని నాకిచ్చాడు. తిరిగి వాటిని ఎలా స్వీకరిస్తాడు?' అన్నది. బ్రాహ్మణుడు విసుగుతో తిరిగివెళ్ళిపోయాడు.

మర్నాడు బ్రాహ్మణుడు యథాపూర్వంగావచ్చి చెట్టు దులుపుతున్నాడు. మీనాక్షి పనిమనిషినిపిల్చి 'నేనీబాధ చూసి భరించలేను, ఈగదిలో నిద్రపోలేను. పక్కగదిలోకి నా పరుపు మార్చు' అన్నది.

శయ్యామందిరం మరోవైపుకు మారింది. అక్కడి కిటికీ నుంచి చూస్తే ఎదురుగాఉన్న రాయచౌదరిగారి సౌధం చాలా దర్శనీయంగా ఉన్నది. ఒకనాడు మీనాక్షి భర్తకు కిటికీవైపు చూపి 'చూశారా! ఆ చౌదరిగారి పసివాడు ఎంత ముద్దులు మూటగడుతున్నాడో! ఒక క్షణం ఎత్తుకు ముద్దాడితే బాగుండు' అన్నది. 'వారు ఐశ్వర్యవంతులు! మనబోటి బీద వాళ్ళఇళ్ళకు అతణ్ణి ఎందుకురానిస్తారు' అన్నాడతడు నిర్వేదంతో. 'మీదంతావెట్టి! పసిపాపలకు ఐశ్వర్యంతో ఏంపని? స్త్రీల ఉత్సంగము సింహపీఠిక కంటె కూడా ఉన్నతమైందని ప్రతి పాప భావిస్తాడు' అని ఆమె బదులు పల్కింది.

భర్త అక్కడికి వెళ్ళి తిరస్కృతుడై తిరిగివచ్చి 'అక్కడ నన్ను కన్నెత్తిచూచిన వాళ్ళుకూడాలేరు' అన్నాడు.

మీనాక్షి మరునాడు తన పనిమనిషినిపిల్చి 'ఇదుగో! పాప ఒంటరిగా ఆ తోటలో ఆడుకొంటున్నాడు. పరుగెత్తి అతడినోట్లో ఈ కలకండపెట్టిరావే!' అన్నది.

సాయంకాలం భర్త క్రోధోద్రిక్తుడై ఇంటికివచ్చాడు. "రాయచౌదరిగారు మనమీద కారాలు మిరియాలు నూరుతున్నారు చూశావా!" అన్నాడు మీనాక్షితో. ఎందుకు ?

ఇకముందు ఎప్పుడైనా మన పనిమనిషి వారి తోటలో కనపడితే పోలీసులకు పట్టిస్తారట!

మీనాక్షికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై 'ఔను! నాకూ తెలుసు! పసివాడి చేతిలో నుంచి కలకండముక్క బలవంతంగాలాగి పారవేయడం కళ్ళారాచూశాను! అంతేగాదు! పాపం! చిట్టితండ్రి బుగ్గగూడా నలిపారు! ఇక్కడ నేనికబతకలేను! మరోచోటికి పోదాం! ఇల్లు వెదకండి!' అన్నది.

—*Tagore: 'Meenu'*

# 8. నిక్షేపం

బాలిక ఇంట్లోకి పరుగెత్తుకుంటూ వచ్చి అమ్మదగ్గిర చేరి "చూశావా! అమ్మా! చూశావా! నేనేం తెచ్చానో చూశావా?" అన్నది. నవ్వు దొంతరలతో కళ్ళు మెరిసిపోతున్నాయి. పట్టరాని సంతోషంతో ఆమె కొట్టే చప్పట్లకు నుద్దైన ఎట్టటి చిన్ని గాజులు తాళం వేస్తున్నాయి. ఆమె రెండుచేతులూ తల్లి మెడ చుట్టూ పెనవేసి "అమ్మా చూడు. నేనేం తెచ్చానో చూడు" అన్నది.

అది బంగారు నీలి వన్నెలతో మెరిసిపోతున్న ఒక పక్షి ఈక. కాని అది బాలిక చేతులలో మెరుస్తూ అనంత ఆకాశం నీలి మేఘమాలికలు, పిట్టల (ఆవాసాలు) కువలయాలు, పసిపిట్టల కూజితాలు, ఆనందమైన ప్రభాతాలు, ఆకాశ విహారాలు బాలిక చెవుల్లో ఊదుతుంటుంది. కోమలమైన ఆ ఈకను బాలిక తన బుగ్గలమీద, కళ్ళమీద తుడుచుకొంటూ ఆతురహృదయంతో "చూడమ్మా, చూడు! నేనేం తెచ్చానో చూడు" అన్నది, వాళ్ళమ్మ దానిని చూచి విరగబడి నవ్వింది. "ఏం నిక్షేపం

తెచ్చావే? బుజ్జీ" అంటూ ఆ ఈకను అవతల పారేసి తిరిగి తన పనిలో తాను నిమగ్నమైంది. రెక్కలు తెగిన పిట్టవలె పిల్ల నిలువునా నీరై నేలమీద చదికిలపడ్డది. నవ్వు కాస్తా మటు మాయమైంది. కానేపుండి ఆ ఈకను తీసుకొని వెళ్ళిపోయింది. అది మొదలు తన నిక్షేపాన్ని తల్లికూ్కాడా కనబడకుండా దాచేసుకొనేది.

—*Tagore: 'Bird's feather.'*

# 9. పేరు

నూనూగు మీసాల నూత్నయౌవనారంభంనుంచి అతడు కవితా రచన చేస్తుండేవాడు. పుస్తకం పై పై మెరుగులు దిద్దటంలో మాత్రం ఎక్కువ శ్రద్ధ చూపేవాడు. కాగితానికి ఇరువైపుల తగినంత స్థలంవదలి అక్షరాలు ముత్యాలవలె తీర్చి దిద్ది ముద్దులొలికేటట్లు వ్రాసేవాడు. ఎఱ్ఱసిరాలో ఉండటంచేత అక్షరాలు కొట్టవచ్చినట్టు కనిపిస్తూండేవి. అంతకంటే ఎక్కువ శ్రద్ధవహించి అలంకరించిన అట్టమీద ముత్యాలకోవలో తనపేరు ముద్దుగా వ్రాసుకొనేవాడు. తన రచనలన్నింటిని బీరువాకుండా ప్రచురణార్థం పత్రికలకు పంపేవాడు. కాని అవి తిరస్కార ముద్రతో తిరిగివచ్చేవి. అప్పుడు క్రోధోద్రిక్తుడై తనకు ధనం లభిస్తే వెంటనే తానే ఒక పత్రికను నిర్వహించి తన రచనలన్నింటినీ ప్రకటిద్దామనుకొన్నాడు. తండ్రి మరణానంతరం హితైషులైన బంధువులందరూచేరి వ్యర్థమైన కావ్యరచనతో కాలము వ్యర్థముచేయవద్దని తగిన ఉద్యోగానికి కృషిచేయడం మంచిదని సలహా ఇచ్చారు. అతడు దానికి అవహేళనగా ఒక వికటాట్టహాసంచేసి గీతికారచనకు కలముపట్టాడు. ఒకటి వెంట

ఒకటిగా మూడు పుస్తకాలు ప్రచురించాడు. ప్రచురణానంతరము లోకమంతా తన సాహితీసేవకు ప్రశంసిస్తారని గాలిమేడలు కట్టాడు. కాని అతని ఆశాసౌధం క్షణంలో నేలమట్టమై అతణ్ణి నిర్విణ్ణుణ్ణిచేసింది. కాని ఒక దిక్కునుండి మాత్రము అతని కావ్యప్రశంస వినవచ్చింది. అది ఆతని ముద్దుల మేనల్లుడు. అతడు అప్పుడప్పుడే గణితము నేర్చుకొంటున్నాడు. కంటబడ్డ పదాలను అన్నింటినీ పలకడానికి ఉత్సాహం చూపుతున్నాడు. ఒకనాడు అతడు ఒక పుస్తకాన్ని చంకబెట్టుకొని మామ దగ్గరకు పరువెత్తుకొనివచ్చి "మామా! నీ పేరు అచ్చులో ఉన్నది, నా పేరు అచ్చులో" అని అర్థోక్తిలో ఆయాసంతో అన్నాడు. మామమందహాసంతో అతణ్ణి దగ్గరకు తీసి చెక్కిలి ముద్దాడాడు. అలమరులోని అచ్చుపుస్తకాన్ని ఒకదాన్ని తీసి అట్టపై అందంగా ఉన్న తన పేరును చూపి "దానిని చదవ గలవా?"అని అడిగాడు. మేనల్లుడు వర్ణోచ్చారణ చేశాడు. అది కూడా మామ పేరే. రెండవ పుస్తకాన్ని; మూడవపుస్తకాన్ని త్రిప్పిచూశాడు. అన్నింటిమీద అదే పేరు! మామపేరు మూడు పుస్తకాలమీద చూడగనే బాలుడు ముగ్ధుడై "మామా! ఈ పుస్తకాల గుట్టమీద ఎక్కడ చూసినా నీపేరే! పదులు, వందలు, వేలు!" అని అన్నాడు. మహదానందంలో మామకు కళ్ళు మూతలు పడ్డాయి. బాలుడు పుస్తకాలు తీసుకొని తన వృద్ధ దాదికి చూపటానికి పరుగెత్తాడు.

కొంతకాలానికి మామ నాటిక నొకదాన్ని వ్రాశాడు. మిత్రులందరు ప్రకటనకు అది అన్నివిధాల యోగ్యంగా ఉందని ప్రస్తుతించారు. ఏ పత్రికాధిపతి అయినాసరే దాన్ని ప్రకటిస్తా డని ఆశపడ్డారు. తన గ్రంథరాజానికి తనను కూడా నగర

మంతా ప్రశంసిస్తున్నట్టు అతడు తియ్యని కలలుకూడా కన్నాడు.

ఆ నాటికను గురించి పత్రికాసంపాదకుని అభిప్రాయం తెలుసుకోడానికి ఒకనాడు అతని మిత్రుడు నాటికను తీసుకు పోయినాడు. అతని రాకకోసం ఎదురు తెన్నులు చూస్తున్న మామకు తన మేనల్లుడు ఆడుతున్న నాటకం పట్టలేదు. అల్లుడు పక్కన ఉన్న ముద్రాశాలనుంచి తన పేరును కట్టించుకొని వచ్చి అలమరులో ఉన్న ప్రతిపుస్తకంమీద తన పేరు ముద్రించడం మొదలు పెట్టాడు. మేనమామను ఒక్కసారిగా ఆశ్చర్య చకితుణ్ణి చేయాలని అతని సంకల్పం!

అల్లునిచర్య మామకు కొంత విస్మయాన్ని కలిగించింది. బాలుడు విసుగు విరామంలేకుండా తిరగడం గమనించి 'అంత ఊపిరి సలపకుండా అక్కడ ఏంచేస్తున్నా'వని ప్రశ్నించాడు. తానుచేసిన ఘనకార్యంచూపాలని మేనల్లుడు కూడా ఆరాట పడ్డాడు! దాదాపు పాతిక పుస్తకాలమీద తనపేరుకొట్టివేసి అల్లుడు తన పేరు ముద్రించుకోవడం చూశాడు. ఉగ్రుడై 'వెధవ! చదువు సంధ్యలుమానేసి అస్తమానం ఆటలతో కాల క్షేపం చేస్తున్నాడు పోచికోలు వెధవ!' అని కసరుకొని అతడు అష్టకష్టాలుపడి సంపాదించుకొన్న అక్షరపు ముద్రలు ఊడలాగే శాడు. పాపము! బాలుడు గుండెపగిలేటట్లు వెక్కివెక్కి ఏడవ నారంభించాడు.

అప్పుడు వృద్ధ దాదివచ్చి లేవనెత్తి కౌగిటచేర్చుకొని "ఎందుకేడుస్తున్నావు చిన్నబాబూ" అని లాలించింది. బాలుడు కన్నీటిధారలతో వెక్కివెక్కి ఏడుస్తూ అర్ధోక్తిలో "నా పేరు" అన్నాడు. ఇంతలో తల్లివచ్చింది. "ఎందుకు ఏడుస్తున్నావు

బాబు" అని బుజ్జగించింది. అమ్మను చూడగానే దుఃఖము పొంగి పొర్లుకొనివచ్చి "అమ్మా! నా పేరు" అని పిల్లవాడు ఒక్కసారి బావురుమన్నాడు.

దాది తినుబండారాలు తెచ్చిపెట్టింది.కాని వాటి నన్నింటినీ అతడు నలుమూలలకూ తన్నివేసి "నా పేరు! నా పేరు!" అని రోదనము సాగించాడు. తల్లి తిరిగి వచ్చి "ఈ రైలింజను చూశావా! బాబూ ఎంత బావున్నదో" అని లాలింప చూసింది. బాలుడు దానిని గిరవాటువేసి "నా పేరు!" అని మారాము చేయసాగాడు.

సంపాదకుణ్ణి సంప్రతింపబోయిన మామ స్నేహితుడు వచ్చాడు. వారు ఆ నాటికను అంగీకరించలేదని చావు కబురు చల్లగా వెలిబుచ్చాడు. ముహూర్తమాత్రం మామ మౌనముద్ర వహించి గంభీరవదనంతో "నా సర్వస్వాన్ని వెచ్చించైనా, తల తాకట్టు పెట్టైనా నేనే స్వయంగా నాటికను ప్రకటిస్తాను" అని తన మనో నిశ్చయాన్ని వెలిబుచ్చాడు.

"నగరంలో ఆటలపోటీ పందేలు సాగుతున్నాయి. సాయంకాలం చూడడానికి వస్తావా" అని స్నేహితుడడిగాడు. "నాకు వంట్లో బాగాలేదు. క్షమించు" అని స్నేహితునికి జవాబు ఇచ్చాడు. మధ్యాహ్నమైంది. తల్లి గదిలో ప్రవేశించి "నాయనా! టీ తీసుకురానా"అని అడిగింది. "ఈరోజు 'టీ' అక్ఖరలేదు" అని కసరుకొన్నాడు.

సంధ్యాసమయంలో ప్రేయసి దగ్గరచేరి "ఏమండీ మీరీ మధ్యవ్రాసిన నాటికను చదివి వినిపిస్తారా" అని సారస్యంగా అడిగింది. "నా తల పగిలిపోతున్నది" అని తగు మాత్రంగా అతడు సమాధానమిచ్చాడు.

మేనల్లుడు ధైర్యంచేసి గదిలో ప్రవేశించి "నా పేరు నాకు తిరిగి ఇచ్చివెయ్యవా ?" అని అధికారికంగా ప్రశ్నించాడు. క్రోధోద్రిక్తుడైన మామ మేనల్లుని పాలబుగ్గలమీద ఒక అర్ధచపేటం బహూకరించి పంపివేశాడు.

*-Tagore* : '*Name*'

# 10. ముద్దులరాణి

తుది ఘడియలు ఆసన్నమైనట్టు ఆమెకు తోచింది. ఆమెకు కోరిక ఏమీ లేదు. కాని ఎందుకో చిర్రుబుర్రు లాడుతున్నది. తెలియని బరువుతో కుంగిపోతున్నది. వృద్ధుడైన రాజవైద్యుడు వచ్చి రుచికరమైన మందిచ్చాడు. కాని అసహనంతో దానిని అవతల పారేసింది.

ఆతురతతో రాజు శయనాగారానికి వేగంగా వచ్చాడు. ఆమె ముఖం మీదకు వంగి "ఏమిటి నీ బాధ? ఏంకావాలి?" అన్నాడు. ఆమె రుద్ధకంఠంతో "మీరందరు నన్ను విడచి వెళ్ళండి. నా నెచ్చెలిని మాత్రం చూడనియ్యండి".

ఆమె స్నేహితురాలు వచ్చింది. రాణి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని "నీతో ఎన్నో విషయాలు చెప్పాలి" అని చెవిలో గుసగుసలాడింది.

"చెప్పు, సంగతులన్ని చెప్పు" అన్నది నేస్తురాలు. "విను. ఈ యేడుసౌధాల్లో పెద్దరాణీగారికి మూడుండేవి. తరవాత రెండుండేవి. ఆపైన ఒకటి ఉండేది. తరవాత ఇక్కడినుంచే

ఆమె వెళ్ళిపోయింది."

కాలంగడిచింది. ఆమెను గురించిన ఆలోచనే మానేశాను.

సంక్రాంతి పండుగ వచ్చింది. నెమలి పల్లకీలో మేళ తాళాలతో వీధులగుండా ఊరేగాను. మహావైభవంగా ఉన్న ఆ రాజోత్సవంలో బయటికి తొంగిచూడడానికైనా వీలైంది కాదు.

నదిగట్టున చల్లని చెట్లనీడలో ఒకచిన్న కుటీరంచూశాను. అది మట్టిది. 'అపరాజిత' లత తన నీలిపూలతో కంచె మీదికి పాకింది. గుమ్మాని కిరువైపులా బియ్యపు పిండితో శంఖ చక్రాలు అందంగా శుభోదర్కంగా ఉన్నాయి.

నా పక్కన నడుస్తున్న ఛత్రధారిణిని "బొమ్మలా అందంగాఉన్న ఆ ఇల్లు ఎవరిది?" అని అడిగాను. ఆమె "ఆ మట్టి యిల్లా? పెద్దరాణిగారిది" అన్నది.

ఇంటికి తిరిగివచ్చాను. రాజుగారువచ్చేదాకా చీకటి గదిలో కూర్చొన్నాను. ఆయనవచ్చి "ఏమిటి నీ బాధ? ఏం కావాలి?" అన్నారు. "నేనీయింట్లో ఉండలేను"అన్నాను. "నీకు మరో ఇల్లుకట్టిస్తాను. దాని గోడలు దంతంతో ఉంటాయి. నేల పాలపొంగులా తెల్లగా శంఖభస్మంతో తయారుచేయిస్తాను. అంచులు ముత్యాలతో పద్మాలమాలలతో అలంకరించేట్టు చేస్తాను సరేనా!" అన్నారు.

"నే కోరేది పట్నానికి దూరంగా ఒక మట్టియిల్లు" అన్నాను.

"అలాగా! సరే! కట్టిస్తాను" అన్నారు.

మట్టియిల్లు తయారయింది. అది అప్పుడే అడవిలో తీగ నుంచి తెంపితెచ్చిన ఒక వికసిత పుష్పంలా ఉన్నది. దానివలెనే ఆ యిల్లుకూడా సంకుచితమై వన్నెదరిగినట్లైంది. కొంతకాలం ఉన్నాను. కేవలం రోతనిపించింది.

మాఘమాసం వచ్చింది. నూర్వురు చెలికత్తెలు వెంట రాగా స్నానానికి నదికి బయలుదేరాను. నెమలిపల్లకి నీటిలో మోకాటిలోతుదాకా వెళ్ళింది. తిరిగి వస్తూ పల్లకీ తలుపు తెరచి చూశాను. ఎవరామె ? ఎఱ్ఱటి అంచుల తెల్లటి చీరకట్టింది. చేతికి మట్టిగాజులు మాత్రం ఉన్నాయి. నదిలో స్నానంచేసి పాత్రను నీటిలో ముంచుతున్నది. తడి తల సూర్యకాంతిలో మెరుస్తున్నది. దైవసమర్పితమైన శ్వేత పుష్పోపహారంలా ఆమెలో ఒక విధమైన స్వచ్ఛతా మనోజ్ఞతలు కనబడు తున్నాయి.

"ఎవరామె? ఏ దేవాలయంలో ఆమె పూజచేస్తుంది" అన్నాను. ప్రక్కనున్న ఛత్రధారిణి మందస్మితంతో "పెద్దరాణీ గారిని మీరు గుర్తుపట్టలేదా?" అన్నది.

తిరిగి గదికివచ్చి మౌనముద్ర వహించి కూర్చొన్నాను. రాజుగారు వచ్చి "ఏమిటి నీబాధ? ఏంకావాలి" అన్నారు.

"ప్రభాతసమయంలో నదికివెళ్ళి స్నానంచేసి మృణ్మయ భాండంతో నీరునింపి రొంటిని బెట్టుకొని రావాలని నా కాంక్ష" అన్నాను. రాజుగారు "అలాగా! సరే అలాగే జరుగుతుంది" అన్నారు.

నదికి వెళ్ళేదారికిరువైపులా రక్షకభటులు నిల్చొని

ఉన్నారు. రాకపోకలన్నీ ఆగిపోయాయి. దారి నిర్మానుష్యంగా ఉన్నది.

ఎఱ్ఱంచు తెల్లనూలుచీరె ధరించాను. మామూలు గాజులు పెట్టుకొన్నాను. స్నానంచేసి మృణ్మయభాండం అంచు దాకా నీరు నింపాను. రాజద్వారం సమీపించగానే భాండాన్ని విసరిపారవేశాను. అది కిందబడి ముక్కలు ముక్కలైంది. నాకు సిగ్గుచేటనిపించింది.

మరో పండుగ రోజువచ్చింది. ఆ క్రితంరాత్రి నగరం వెలుపల నిండు వెన్నెలలో తెల్లవారేదాకా నృత్యగాన ప్రదర్శనలు జరిగాయి.

ఉత్సవానంతరం అలంకరించిన పట్టపుఏనుగు మీద కూర్చొని సౌధానికి తిరిగి వస్తున్నాను. దారిప్రక్కన ఒక అందాల యువకుడు నడుస్తున్నాడు. పుష్పించిన పూలతో ఉన్న కిరీటం ధరించాడు. చేతిలో అడవిలో ఏరితెచ్చిన కందమూలాలతో, ఫలాలతో నిండిన బుట్ట ఉన్నది. "ఈ అందాల రాశిని గన్న అదృష్టవంతురాలెవ్వరో?" అన్నాను. ఛత్రధారిణి "మీరెరుగరా! పెద్దరాణిగారి కుమారుడు. తల్లిగారికి కానుకలు తీసుకొని పోతున్నాడు" అన్నది.

శయనమందిరం చేరి విచారంతో మౌనముద్ర దాల్చాను. రాజుగారు వచ్చి 'మళ్ళీ నీ బాధ ఏమిటి ? ఏం కావాలి ?' అన్నారు.

"నేను ఇక కందమూలాలు, పళ్ళు తినాలనుకొంటున్నాను. నా కొడుకు తన చేతులతో వాటిని అడవినుంచి కోసి ఒక బుట్టలో తీసుకొని రావాలి" అన్నాను.

"అలాగా! సరే! అలానే జరుగుతుంది" అన్నారు.

నేను బంగారు పూల పీటమీద కూర్చొన్నాను. నా చిన్న కొడుకు తెచ్చిన కానుక అందుకొన్నాను. వానికి ఒళ్ళంతా చెమటపట్టింది. అరుణ రంజితమైన వాని ముఖంలో క్రోధ చ్ఛాయలు కనపడ్డాయి.

ఆ కానుక అలాగ పరిత్యక్తమై నా కాళ్ళ దగ్గిర పడి ఉన్నది. మనస్సులో నాకు రోతనిపించింది.

ఏమైందో తెలియదుగాని అప్పటినుంచీ ఒంటరిగా ఉండా లనిపిసుంది. పదిమందితో కలిసి ఉండటమంటే చికాకు. నోరు కట్టుబడిపోయింది.

రాజుగారు ఏమిటిబాధ? ఏంకావాలి?" అంటారు. ఏమీ జవాబు చెప్పలేను

నేను ముద్దురాణినై నా నాకు నిజంగా ఏం కావాలో చెప్పలేను. సిగ్గుచేటు! నీకుమాత్రం నా రహస్యం చెప్పనియ్యి. నాకు కావలిసిందంతా పెద్దరాణి దుఃఖం; బాధ.

నెచ్చెలి ఆశ్చర్యంతో బుగ్గ నొక్కుకున్నది!

"అయితే ఎందుకు? అలా ఎందుకు?" అని ఆమె ప్రశ్నించింది. ఆమె దగ్గరున్న వేణువునుంచి మధురగానం వెలువడు తుంది. కాని నా బంగారు పిగ్న గ్రోవి నా చేతికే ః చేటు! దాన్ని ఠీవిగా జాగ్రత్తగా ఉంచుతాను. కాని అది మాత్రం సంగీతం పలకదు.

*Tagore: 'The favourite queen.'*

# 11. విజయలాంఛనం

యుద్ధభూమినుంచి అశుభమైన వార్తలు వినవచ్చినాయి. కింకర్తవ్యతా మూఢుడైన భూపతి తన ఆరామంలో అటూ ఇటూ పచారుచేస్తూ ఆలోచనా నిమగ్నుడైనాడు. ఆరామ ప్రాంగణంలో వృక్షచ్ఛాయలో బాలబాలికలిద్దరు ఆటల్లో మునిగి ఉన్నారు. రాజు వాళ్ళవంకచూచి మీరాడే ఆటపేరు ఏమిటి?' అన్నాడు. 'సీతారాముల వనవాసం' అని బాలుడు జవాబిచ్చాడు. రాజు కూర్చొని అతికుతూహలంతో ఆటను చూస్తున్నాడు. క్షణమైనా విశ్రాంతిలేకుండా బాలుడు పర్ణశాలా నిర్మాణానికి కాబోలు తృణ కాష్ఠాదులు చేరవేస్తున్నాడు. బాలిక కందమూలాలను ఆకుకూరలను ఉడకబెడుతూ వనవాసియైన తన భర్తకు రుచిరాన్నపచనంలో నిమగ్నఅయింది. వంట సాగుతున్నది. పొయ్యిలో నిప్పుమాత్రం ఒక్కటే తక్కువ.

'అన్నీ సరిపోయినాయి. కాని రాముడు హతమార్చవలసిన రాక్షసుడేడి' అని రాజు ప్రశ్నించాడు. 'ఆ విషయాన్ని పూర్తిగా మరచిపోయా'మని బాలుడు నొచ్చుకున్నాడు. అలాఅయితే రావణ పాత్రను తాను ధరిస్తానని రాజు ముందుకు

వచ్చాడు. బాలుడు క్షణమాత్రం రాజును నఖశిఖ పర్యంతం చూసి 'కాని నావల్ల మీరు పరాజయం అంగీకరించాలి గదా!' అన్నాడు.

'అపజయం అంగీకరిస్తాను. నీవే చూస్తావుగా!' అన్నాడు భూపతి.

ఉత్సాహోద్రేకాలతో బాలుడు రావణసంహారానికి సన్నద్ధుడైనాడు. ఆ రోజున దశకంఠుని సంహారము అతి ప్రశాంతంగా సాగింది. సీతారాముల ప్రవాసకాలంలో మోస్తరుగానే ఈనాడుకూడా కోకిలారావాలు, ప్రభాతసౌందర్యాలు ప్రతీయమానమయినాయి. భూపతికి చిత్తశాంతి కలిగింది.

భూపతి అమాత్యుని పిల్చి ఆ బాలబాలికలను జూపి 'వీరెవ్వరు?' అన్నాడు.

'ఈపిల్ల నా కుమార్తె రుచిర. అతడు ఒక బీదపురోహితుని కుమారుడు కౌశికుడు.

'వీరు పెరిగి పెద్దవారైన తరువాత భార్యాభర్తలు కావాలని నా అభిలాష' అని రాజు అన్నాడు. తన అసమ్మతిని వెలిబుచ్చలేక అమాత్యశేఖరుడు శిరస్సు వంచాడు.

రాజ్యంలో ఉన్న ఉత్తమోత్తమమైన కళాశాలలో కౌశికుడు ప్రవేశించాడు. కులీనులకూ, సుసంపన్నులకూ మాత్రమే ప్రవేశార్హతఉన్న ఆ కళాశాలకు కౌశికుడు రావడం గురునికి కంటకమైంది. అమాత్యశేఖరుని అనుంగుపుత్రిక రుచిర కూడా ఆ కళాశాలలో చదువుతున్నది. తదితర సబ్రహ్మచారు

లకు కూడా కౌశికుని ప్రవేశం కంటకంగానే ఉన్నది. కాని రాజ శాసనం శిరోధార్యం గదా!

రుచిర సందిగ్ధావస్థలో పడ్డది. ముందుచూస్తే నుయ్యి! వెనుకచూస్తే గొయ్యి! బాలబాలికలు రుచిరా కౌశికులను చూసి గుజగుజలు పోతున్నారు. అది ఆమె కసహ్యంగా ఉన్నది.

ఆమె క్రోధంతో కుమిలిపోతున్నది. కళ్ళు జేవురించాయి. ముఖం రక్తరంజితమైంది. దారిలో జారిపడిన పుస్తకాన్ని కౌశికు డెత్తియిచ్చినా రుచిర కృతజ్ఞత చెప్పేదికాదు! పిలిస్తే పలికేది కాదు! మౌనముద్ర వహించేది.

గురునికి రుచిరమీద అపారమైన అభిమానం. అన్ని విష యాల్లోను కౌశికుని కంటె రుచిర ముందంజవేయాలని గురుని సంకల్పం! రుచిర శపథం కూడా అదే! రుచిర కౌశికుణ్ణి అధిగ మించేటట్టే తోచింది. కౌశికునికి ఆసక్తి ఒక పఠనమందే కాదు- ఆటపాటలలో, స్వేచ్ఛావిహారాలలో, ఈదులాటలలో అతనికి కాలక్షేపం అయ్యేది.

ఆచార్యుడు అతణ్ణి అదుపులో బెట్టాలని ఒకనాడు కౌశి కుణ్ణి పిలిచి, 'చదువుసంధ్యల్లో శ్రద్ధచూపటంలేదు కారణం ఏమిటి' అన్నాడు. 'ఆర్యా! నాకు అధ్యయనంలోనేకాదు, అన్ని విష యాలలోను ఆసక్తి సమానమే!' అన్నాడు కౌశికుడు.

'అనుచితాలు, అనవసరాలు అయిన అన్యవిషయాలలో ఆసక్తి విడిచిపుచ్చి పుస్తకం చేపట్టకపోతే మర్యాద దక్కదు! జాగ్రత్త!' అని గురుడు కఠినంగా హెచ్చరించాడు. కౌశికుడు

నెమ్మదిగా 'ఆర్యా! అలా అయితే అధ్యయనంలో కూడా శ్రద్ధ అణగారుతుందేమో!' అన్నాడు.

రోజులు గడిచాయి. భూపతి ఆచార్యుణ్ణి పిలిపించాడు. వారిద్దరికి సంభాషణ ఇలా సాగింది.

'నీ శిష్యగణంలో శ్రేష్ఠులెవరు ?'

'రుచిర ప్రభూ !'

'కౌశికుడో !'

'అతనికి విద్య ఉపకరించేటట్లుతోచదు ప్రభూ !'

'రుచిరా కౌశికులు దంపతులు కావాలని నా సంకల్పం.' గురువు అపహాసించి 'వెలుగునీడలను సమకూర్చినట్లుంటుంది' అని మౌనంగా ఉన్నాడు. అమాత్యుణ్ణి కూడా పిలిపించాడు. అతడు రాగానే రాజాతని చూసి 'రుచిరా కౌశికుల వివాహం ఇక ఆలస్యం కాకూడదు' అన్నాడు.

'దేవరచిత్తం! కాని రుచిరకు ఇది రుచించడంలేదు.' 'కామిని తన హృదయాన్ని ఎప్పుడైనా విప్పిచెప్పడం విన్నావా'?

'కాని ఆమె బాష్పాకులిత నేత్రాలే దాన్ని పరిస్ఫుటం చేస్తున్నాయి!'

'కౌశికుడు తనకు తగడని ఆమె తలంపా ?'

'ఔను'

'అయితే వారిరువురకూ నా ఎదట వాదపరీక్షను ఏర్పాటు

చేయండి! వాదంలో కౌశికుడు విజయంపొందితేనేగాని వారి వివాహా నేనైనా సమ్మతించను.'

రాజసభాంగణం క్రిక్కిరిసినట్లున్నది. సార్వభౌముడు సింహాపీఠాన్ని అధిష్ఠించాడు. కౌశికుడు ఆయన సన్నిధిలో ఉపవిష్టుడైనాడు. ఆచార్యుడు రుచిరతో సభాప్రవేశం చేశాడు. కౌశికుడు ఇరువురికి నమస్కరించాడు. కాని రుచిర కౌశికుని క్రీగంట కూడా వీక్షించలేదు. సభ అంతా నిశ్శబ్దంగా ఉన్నది.

రుచిరా కౌశికులెవ్వరూ ఇదివరలో వాదించిన వారు కారు. తిరస్కృతుడు కావడంచేత కౌశికుడు సబ్రహ్మాచారుల వాదోపవాదాల్లో ప్రవేశించలేకపోయాడు. వాదం ఆరంభమైంది. వాక్కుల రణం విజృంభించింది. సభ గుక్కతిప్పుకో లేకుండా ఉన్నది. సన్నికర్షంచేత దీప్తిమంతమైన అయస్కాంతం మోస్తరుగా కౌశికుడు చెణుకులు విసరుతూ తన వాద చాతుర్యం ప్రదర్శిస్తున్నాడు. రుచిరకు ముచ్చెమటలు పోశాయి. ముఖం వివర్ణమైంది. చర్చాగాంభీర్యంలో ప్రత్యుక్తులకు తడవు కొంటున్నది. బుద్ధి మందగించినట్లు తోచింది. రుచిర పరాభూత కాబోతున్నదని గ్రహించగానే కౌశికుడు వాదాన్ని ముగించి ఊరుకొన్నాడు. ఆచార్యుని కంఠం మాత్రం క్రోధరుద్ధమైంది. రుచిర నేత్రాలు బాష్పపూరితాలైనాయి.

భూపతి అమాత్యుణ్ణి పిల్చి 'ఇక వివాహానికి సర్వం సన్నద్ధం చెయ్యవచ్చు' అన్నాడు. కౌశికుడు లేచి సవినయంగా 'ప్రభూ! క్షమించండి. ఈ వివాహం నేను అంగీకరించను!' అన్నాడు. నృపతి నివ్వెరపోయినాడు.

'విజయలాంఛనం తిరస్కరిస్తావెందుకు ?'

'విజయము నాదే! కాని ఫలితాన్ని వేరొకరిని అనుభవించ నీయండి.'

ఇంతలో ఆచార్యుడు అందుకొన్నాడు- 'ప్రభూ! ఒక సంవత్సరం గడువు దయచెయ్యండి. సంవత్సరాంతాన తిరిగి వాదపరీక్షను ఏర్పాటు చేయించండి' అన్నాడు.

భూపతి దాని కంగీకరించాడు.

కౌశికుడు పాఠశాలకు స్వస్తిచెప్పాడు. వృక్షచ్ఛాయ ల్లోను పర్వత శిఖరాల్లోను తిరుగుతుండేవాడు.

తనశక్తినంతా వినియోగించి ఆచార్యుడు రుచిరకు విద్య నూరిపోస్తున్నాడు. కాని ఆమె చిత్తమో! పరాయత్తమైంది! ఆమె అవధానము రెండు ముఖాల ఉన్నది. రుచిరను చూసిన కొద్దీ గురునికి చిరాకుహెచ్చింది. 'ఈ సదవకాశం తప్పితే మళ్ళీ అవమానం తప్పదు సుమా! జాగ్రత్త!' అని అతడు ప్రబో ధించాడు.

కౌశికునిదగ్గర పరాజయంతప్ప రుచిర వేరొకటి అభిల షించడంలేదు. పుస్తకాన్ని కన్నెత్తిచూడనని ఆమె శపథం చేసిందేమో! గురుడు క్రోధోద్రిక్తుడైనాడు. 'ఈశ్వరసాక్షిగా అబలను అధ్యయనానికి నేనిక జన్మలో అంగీకరించను! వేద శాస్త్రాల లోతైనా తెలుసుకొన్నానుగాని కామినీ హృదయ కావ్యరస గ్రహణం చెయ్యలేకపోయాను!'

ఒకనాడు ప్రధాని ప్రభువును సమీపించి 'ప్రభూ! బాభ దత్తుని దగ్గరనుంచి సంబంధం వచ్చింది. ఆభిజాత్యంలో, ఐశ్వ ర్యంలో, పేరుప్రతిష్ఠల్లో వారిని మించిన వారులేరు. తమ అంగీ

కారానికి వేచిఉన్నాం' అన్నాడు.

'రుచిర అభిప్రాయం ఎలాఉన్నది?'

'కాంత తన హృదయం ఎప్పుడైనా విప్పి చెబుతుందా?'

'ఆమె బాష్పాకులిత నేత్రాలు ఈసారి ధ్రువపరచడం లేదా?' కశాఘాతంవంటి యీ మాటకు అమాత్యుడు మారు మాటాడక తలవంచుకొన్నాడు.

భూపతి ఆరామం నుంచి రుచిర కాహ్వానం వచ్చింది. రుచిర రాజాజ్ఞను తలదాల్చి వచ్చింది. 'రుచిరా! ఆనాటి సీతా రాముల వనవాస నాటకము జ్ఞాపకమున్నదా?' సిగ్గు దొంతరల ముసిముసినవ్వులతో రుచిర మురిసిపోయింది.

'ఆ నాటకం మళ్ళీ ఈరోజున ప్రదర్శిస్తే చూడాలని ఉన్నది' అని రాజు జవాబుకోసం నిరీక్షించాడు.

నిరుత్తరయై రుచిర తన మేలిముసుగును కొంచెం సవరించుకొంది.

'దండకారణ్యం ఉన్నది! రాముడున్నాడు! ఒక్క సీత మాత్రం కొదువగా ఉన్నది. నువ్వు అంగీకరిస్తే నాటకం పూర్తి అవుతుంది! ఏమంటావు రుచిరా!' అన్నాడు రాజు.

రుచిర ప్రభువును సమీపించి పాదాభివందనంచేసి నిలబడ్డది.

'చిట్టి తల్లీ! ఈసారిమాత్రము నేను రావణపాత్రను ధరింపను సుమా!' అని రాజు మందహాసం చేశాడు.

రుచిర సాదరంగా రాజువంక చూసింది. 'ఈసారి అసుర పాత్రను ఆచార్యుడు అభినయిస్తాడులే' అని భూపతి అన్నాడు.

—*Tagore: 'The Trophy of Victory'*

# 12. నాకోకథ చెప్పవా?

శిశువు మాటలాడడం నేర్చింది మొదలు తన పితామహి దగ్గరో మాతామహిదగ్గరోచేరి 'బామ్మా! నాకోకథ చెప్పవా!' అని మారాంచేస్తుంది. ఆమె శిశువును పక్కనపడుకోబెట్టుకొని అనగా అనగా ఒక రాజుండేవాడు. ఆయనకు ఒక కొడుకుండేవాడు. ఒకరోజున అతడు తన మిత్రుడైన మంత్రికుమారునితో బయలుదేరి... ...

ఇంతలో అయ్యవారు ప్రత్యక్షమై 'నాలుగుమూళ్లు ఎంత? చెప్పు! పన్నెండు' అని తొడపాశం ఆరంభిస్తాడు. పిల్లవాడి క్షేమంకోరే వారందరూ అతణ్ణి దగ్గరకుతీసి బుజ్జగించి 'నాయనా! మీ నాయనమ్మ చెప్పేకథలు వట్టి పుక్కిటి పురాణాలు. వాటిని వినకు. పంతులుగారు చెప్పేదంతా సత్యం. దాన్ని శ్రద్ధగావిను' అని నిత్యం అతని చెవిదగ్గరచేరి పాడుతుంటారు. కాని అది అతని చెవి దూరదు. ఒకవేళ దూరినా మనస్సుకెక్కదు! అతని ఊహాలు రెక్కలుకట్టుకొని సప్త

సముద్రాలు దాటి రాక్షసుణ్ణివధించే రాజకుమారుని వెంట ఎగిరిపోతుంటాయి. గణితానికి ఆ శక్తి ఏది? చదువుమీద శ్రద్ధ చూపకుండా కథలు వినే బాలుణ్ణిచూసి అతని శ్రేయస్కాములు తలలూపి 'కుఱ్ఱవాడు పాడై పోయినాడు- పూర్తిగాపాడైనాడు. ఇక ఇతనికి దండమేశరణ్యం' అని అనుకొనేవారు. వీరందరూచేరి అవ్వనోరు మూయగలరే కాని ఒకరి తర్వాత ఒకరుగావచ్చే కథకులను ఆపగలరా? లేదు. ఆ కథ లకు అంతూపంతూలేదు! శ్రేయస్కాములంతా ఆ కథలు యథార్థాలు కావని నిట్టూరుస్తారు. కాగుణితం ఆరంభించినప్పటి నుంచి కళాశాలలుచేరేదాకా అధ్యాపకులందరూ బాలుణ్ణి సంస్కరింపచూస్తారే కాని అతనిలోఉన్న కథా పిపాసను మాన్పలేరు.

యుగయుగాలుగా ప్రపంచం నలుమూలల్లోను ప్రతి గృహమూ కథలకు పుట్టిల్లైంది. మానవుని పిత్రార్జితంలో ఈ కథాసంచయానికి మించిన వస్తువులేదు. శ్రేయస్కాములు అసలు విషయాన్నే మఱచిపోయారు. అసలు కథాకల్పనమే పరమేశ్వరునికి ఒక ఉబుసుపోక. అదే వారసత్వంగా మానవు నికి కూడా అబ్బింది. ఈశ్వరునిలో నుంచి దానిని తొలగిస్తేనే కాని మానవుని హృదయంనుంచి దాన్ని తొలగించనేలేము.

ఒకానొకప్పుడు సృష్టికర్త తన కర్మాగారంలో ధాతువు లతో సృష్టినిర్మాణం ఆరంభించాడు. అప్పుడు ఈ విశ్వమంతా ఆవిరిరూపంలో ఉండేది. పొరలు పొరలుగా ఖనిజాలు, పర్వ

తాలు వరసగా ఏర్పడ్డాయి. ఆనాడు విశ్వకర్మనుచూస్తే అత నిలో బాల్యచాపల్యంకన్న నిర్మాణాత్మకదృష్టే కనబడుతుంది.

సృష్టి ఆరంభమైంది. దూర్వాంకురాలు, వృక్షాలు, మత్స్యాలు, పక్షులు, మృగాలు బయలుదేరినాయి. జలగర్భంలో అణగిఉన్నవి కొన్ని; గూళ్ళుకట్టుకొన్నవి కొన్ని; దేశాంతరాలు తిరిగి జాతిని అభివృద్ధిచేసుకొన్నవి కొన్ని.

యుగాలు గడచినాయి. ఒకనాడు సృష్టికర్త మాన వుణ్ణి సృష్టించాడు. ఇదివరలో కేవలం శాస్త్రజ్ఞుడు, నిర్మాత మాత్రమే అయిన సృష్టికర్త మానవసృష్టితో కళాజీవి అయి నాడు.

కల్పనారూపంలో అతడు మానవుని హృదయపు లోతు లను చూపడం ఆరంభించాడు. పశువులకు ఆహార, నిద్రా భయాదులు మాత్రమే తెలుసు. కాని మానవజీవితం కథలు కథలుగా సాగుతున్నది. వ్యక్తికి, సంఘానికి; దేహానికి, ఆత్మకు; కోరికలకు, తిరస్కారాలకు; నిత్యం సంఘర్షణ అనే సుడి గుండాల్లో జీవితవాహిని ఒక కల్పనగా సాగుతుంటుంది. ఇద్దరు వ్యక్తులు ఒకచోటచేరితే 'విశేషాలేమిటి? ఏం జరిగింది' అన్న ప్రశ్న సహజంగా ఉత్పన్నమవుతుంది. ఈ ఉత్తర ప్రత్యుత్త రాలు ఒక ప్రపంచాన్నే సృష్టిస్తాయి. అవే జీవితకథలు. అదే యథార్థమైన మానవచరిత్ర.

చరిత్ర, కల్పనల సమ్మేళనమే ప్రపంచం. అశోక, అక్బరు చక్రవర్తుల చరిత్రమాత్రమే మానవునికి సత్యసరూపం

కాదు. తాను వరించిన దివ్యగుణసుందరికోసం సప్తసముద్రాలు దాటిన సాహసికుడైన రాజకుమారుని చరిత్రకూడా పైవాటి వలె సత్యమైందే. చరిత్రమో స్తరే కేవలం కల్పనాకథకూడా మానవుని దృష్టిలో ఒక్కటే! ఏది యథార్థమైంది? అన్నది కాదు ప్రశ్న! ఏది రసవంతమైన గాథ? అన్నది ప్రధానం.

మానవుడు ఒక కళాఖండం. సృష్టినిర్మాణంలో అవయవ నిర్మాణంకంటె, నీతికంటె ఊహాగానానికే ఎక్కువ పాలున్నది. శ్రేయస్కాములు ఈ సత్యాన్ని కప్పిపుచ్చడానికి యత్నిస్తారు. కాని అది దాగుతుందా? అసలుకే మోసం వస్తుంది. నిపుణులైన శ్రేయస్కాములు, అధ్యాపకులు కాళ్ళబేరానికి వచ్చి నీతికి, కల్పనకు ముడిబెడతారు. కాని రెండింటికి సమన్వయం కంటె సంఘర్షణమే సంభవిస్తుంటుంది. వ్యర్థీభూతమైన ఈ సంఘర్షణవల్ల ఏర్పడ్డ ధూళియే కాలవాహినిలో పొగులు పొగులుగా పేరుకొని పోతున్నది.

*Tagore : "Tell me a story"*

# 13. ముక్తి

భగ్నహృదయయైన ఒక ప్రణయిని విగతజీవుడైన తన ప్రాణ ప్రియుని స్వరూపాన్ని మృణ్మయ రూపంలో తయారు చేయడానికి పుష్పారామంలో కూర్చొన్నది. స్మృతికందినంత వరకు అతని రూపురేఖలు దిద్దటానికి ప్రయత్నించింది. ప్రతిమ వంక ఒక్కసారిచూడగానే పూర్వ చరిత్ర జ్ఞప్తికి వచ్చేది. అంతలో కళ్ళలో నీళ్ళునిండేవి.

కాలంగడచినకొద్దీ చిత్రంమీద మసకలుకమ్మి చిత్రాన్ని విస్పష్టరేఖలతో చూడలేకపోయింది. సరోవరంలోఉన్న సంధ్యా కమలం మోస్తరు ఆమె స్మృతికమలం కూడా ముకుళిత పత్రమైంది.

తన్ను తాను నిందించుకొంటూ సిగ్గుతో తలవాల్చి ఆత్మహింసకు నిశ్చయించుకొని ఆహార నిద్రలుమాని ఫలాలు మాత్రం భుజిస్తూ నీరుతాగుతూ కటికనేలమీద నిద్రిస్తూ కాల క్షేపంచేస్తుండేది.

ప్రతిమ పూర్ణ స్వరూపం ఏర్పడ్డదికాని అందులో జీవ కళ లోపించింది. స్వస్వరూపరేఖ లణగారిపోయినై. తన భావ

ముందున్న చిత్రమొకటి! తన ఎదుటఉన్న చిత్రమొకటి! ఆ ప్రతిమకు ప్రపంచంలో ఎవరిపోలికాలేదు! కాని ఆమె దాన్నే తన జీవితేశ్వరునిగా భావించి ఆరాధిస్తూ ఆత్మవంచన చేసుకొంటున్నది.

దాన్ని నిత్యం కమలాలతో పూజించేది. దాని చుట్టూ జ్యోతు లమర్చేది. ఆ దీప స్తంభాలు సువర్ణమయాలు. ఆ దివ్వెలలో ఉన్న సుగంధతైలంతో ఆ పరిసరాలన్నీ గుబాళిస్తుండేవి. నిర్మాల్యం నానాటికి పెచ్చుపెరిగి విగ్రహాన్ని దృష్టిపథం నుంచి కప్పిపుచ్చేది.

ఒకనాడు ఒక బాలిక ఆమె దగ్గరకువచ్చి 'మేమిక్కడ ఆడుకొంటాం' అన్నది.

'ఎక్కడ ?'

'ఈ బొమ్మదగ్గర'

'ఈ బొమ్మదగ్గరా! వీలులేదు. నేనెవరినీ ఇక్కడకు రానియ్యను!'

ఇంతలో మరో బాలిక వచ్చింది. 'ఆ పూలు కోసుకోనా ?' అన్నది.

'ఏ పూలు ?'

'ఆ ప్రతిమదగ్గర ఉన్న చంపకాలు!' 'వీలులేదు. ఎవ్వరూ ఆ పూలు ముట్టుకోగూడదు.'

మరో కుఱ్ఱవాడు వచ్చి 'ఆ దీపం తెచ్చి కొంచెం దారి చూపిసారా ?'

'ఏ దీపం ?'

'ఆ ప్రతిమ దగ్గరున్న జ్యోతి !'

'ఆ జ్యోతిని అక్కడి నుంచి తియ్యగూడదు.'

బాలబాలికలు ముఠాలుగావచ్చి అక్కడ ఆడుకొనే వాళ్ళు. వాళ్ళ క్రీడలు, సరససల్లాపాలు ఆమెను ఆకర్షించాయి. తదేకధ్యానంతో చూస్తుండేది. మనస్సు పరి పరి విధాల పోతుండేది. అంతలో తన్నుతాను తెలుసుకొని సిగ్గుతో కుంగి పోయేది.

పక్కనున్న పట్టణంలో ఒక సంత జరిగింది. వృద్ధు డొకడువచ్చి 'అమ్మా ! సంతచూచి రావా?' అన్నాడు. ఒక చిన్నపిల్లవచ్చింది. 'లే లే సంతకుపోదాం' అని ఊపిరాడనీయ లేదు. 'నేనురాను. పనిఉన్నది. ఒక్కక్షణంకూడా వ్యర్థం చెయ్యలేను' అని ఆమె అన్నది. మరో బాలికవచ్చి ఆమె కొంగులాగుతూ 'నన్ను గూడ నీతో సంతకు తీసుకొని వెళ్ళవా?' అన్నది. కాని ఆమె ఒక నిముషం కూడా హృద యేశ్వరుని విస్మరించి ఉండలేదుకదా ! ఒకనాటిరాత్రి ఆమెకు నిద్రపట్టలేదు. మేల్కొని కూర్చున్నది. దూరం నుంచి సముద్ర ఘోషవంటిది వినపడింది. వేలకొద్దిజనం సంతకు వెళుతున్నారు. కొందరు నెత్తినమూటలు ఎత్తుకొని, కొందరు వట్టిచేతులతో పోతున్నారు. ఆమె పక్కమీదినుంచి లేచేటప్పటికి తైర్థికుల పదఘట్టన ధ్వనిలో పక్షుల కిలకిలారావాలు సద్దుమణిగినై. తానుగూడా సంతకు వెళ్ళాలన్న కోర్కె మనస్సులో రేగింది. పోదాం, పోవద్దు అన్న తలపులు ఆమెలో సంఘర్షణ పొందు

తున్నాయి. ఒక్క నిమిషం కూడా స్వర్గస్థుడైన తన ప్రియుణ్ణి మఱచి ఉండలేదు!

అత్యాసక్తితో ఆతురపడుతూ ఆమె తన ఆరామంలోకి వచ్చింది. కాని ప్రతిమ ఏది? తైర్థికులు గుంపులు గుంపులుగా ఆ పుష్పారామం మధ్యగా పోయినారు. పుష్పశయ్యా, అందు ప్రతిష్ఠితమైన విగ్రహం కూడా నామరూపాలు లేకుండా పోయాయి. ప్రవాహం మోస్తరు సాగుతున్న జనసమూహం ఆగలేదు. "నా ప్రియుడేడి?" అని తన్నుతాను ప్రశ్నించుకొంది? "ఆ పోయే వారిలో ఉన్నాను" అన్నది ఎక్కడినుంచో ప్రతి ధ్వనించింది. ఇంతలో ఒక బాలుడొచ్చి "నీతో నన్ను తీసుకొని పోవా?" అన్నాడు. "ఎక్కడికి?" "ఎక్కడకేమిటి? సంత చూడటానికి పోవట లేదూ"? అన్నాడు. "ఆవును నిజముగా సంతచూడటానికే అని ఆమె పుష్పారామాన్ని; పూజాపీఠాన్ని వదిలి తైర్థిక వాహినిలో కలిసిపోయింది. అందులో విగతజీవుడైన తన ప్రాణప్రియుని సజీవంగా చూసింది.

—*Tagore : 'Salvation'*

# 14. అంత్యగీతి

భోజమహారాజు సామ్రాజ్యంలో ఒక దేవాలయ మందిరంలో నిత్యము ప్రాతఃకాలసమయాన; ఒక ఆటవిక బాలిక గానం చేస్తుండేది. ఆ బాలిక ఎవరై ఉంటుందని భక్తులు శంకించారు.

"అరుణోదయాన నేను పుష్పాపచయానికి అరణ్యానికి వెళ్ళినప్పుడు ఒక మధురతరమైన గానం నా చెవిన పడింది. ఆ ప్రదేశానికి పోయి చూడగా ఈ బాలిక ఒక పాదమూలాన ఉన్నది" అని దేవాలయ గీతాచార్యుడు విశదీకరించాడు. ఆచార్యుడు అత్యంత ప్రేమాదరాలతో అనాథ బాలికను సాకుతుండేవాడు. తన వీణ మోస్తరుగానే బాలికగూడ ఆతనికి ప్రాణప్రదమైనది. మాట్లాడడం నేర్వడానికి ముందే ఆ బాలిక మధురంగా గానం చేస్తుండేది. కాలం గడచింది. ఆచార్యుని గళంలో కంపనం హెచ్చి శక్తి నశించింది; దృష్టిమాంద్యం హెచ్చింది. అభిమాన పుత్రికయైన అనాథబాలిక అతణ్ణి శిశువువలె పోషిస్తూండేది.

ఆమె గానమాధుర్యం విని ఆనందించటానికి యువకులు నలుమూలలనుండి గుమిగూడుతుండేవారు. ఆచార్యుడు వారిని చూచి వేదన పడుతుండేవాడు. తొడిమ సడలగానే పుష్పం జారిపడిపోతుందని అతనికి తెలుసు "నిన్ను విడిచి ఒక క్షణ మైనా గడపలేనని ఆమె కంట నీరు పెట్టింది". వృద్ధుడు ఆమెను సానురాగంగా అనునయించాడు. "నాలో అదృశ్య మైన గాన స్రవంతి నీలో పునరుద్భవించింది. నిన్ను వదులు కుంటే నా జీవితము అంధకారశూన్యము!' అని ఆచార్యుడు నిర్వేదం పొందాడు.

అది ఫాల్గుణ మాసం. వసంతోదయం ఆసన్నమయిన పూర్ణిమరాత్రి అది. ఆచార్యునికి ప్రియశిష్యుడైన కుమార సేనుడు ఆచార్యునికి దండప్రణామాలు ఆచరించి 'గురుదేవా! మాధవి హృదయం చూరగొన్నాను. మీరు అనుజ్ఞ ఇస్తే వివాహ మాడుతాను' అని విన్నవించుకొన్నాడు. ఆచార్యుడు ఆనందబాష్పాకులిత నేత్రుడైనాడు. "నాతంబురా తెచ్చి మీరు భయులూ రాజదంపతుల మోస్తరు నా ముందు ఆసీనులు కండు" అని ఆజ్ఞాపించాడు. వృద్ధుడు తంబురాను మీటుతూ "నా జీవితంలో అంత్యగీతిని ఆలపిస్తున్నా"నని కంఠమెత్తాడు. చరణమెత్తడానికి ముందే ఆలాపనమందే కంఠము రుద్ధమై గీతి ఆగిపోయింది. వర్ష బిందువుల భారంవల్ల కంపమందే పుష్పము మోస్తరు ఆచార్యుని కంఠంలో కంపనము గోచరమైంది.

గురుడు తంబురాను కుమారసేనుని కందించి 'నా యీ

తంబురాను తీసుకో' అని చెప్పిమాధవి హస్తాన్ని కుమారసేనుని హస్తంలో ఉంచి "ఇదిగో ఇది నా జీవిత సర్వస్వం. ఇక మీరు ఉభయులూ నా గీతాన్ని చివరివరకు ఆలపించండి" అని ఆశీర్వదించాడు.

మాధవీ కుమారసేనులు గీతాలాపనం చేయటం ఆరంభించారు. ఆనంద బ్రహ్మమైన కలకంఠీ కంఠనాద సమ్మిశ్రితమైన ఆ వీణానాదం ఆకాశవీధిలో తారావల్లభుల మధురమయమైన గానాన్ని స్మృతి పథానికి తెస్తున్నది. ఇంతలో రాజభటుడు ద్వారం దగ్గిర తలుపు తట్టినాడు.

భయకంపితుడైన ఆచార్యుడు "ప్రభువుల ఆజ్ఞ ఏమి?" అని ప్రశ్నించాడు. "మీ కుమార్తె అదృష్టము పండినది. రాజుగారు ఆమెకోసం కబురంపారు" అని వార్తాహరుడు అన్నాడు. "కబురంపారా? ఎందుకని?" అని ఆచార్యుడు ఆతురుడై ప్రశ్నించాడు.

"ఉదయాన రాజకుమారి తన భర్త సన్నిధిని చేరడానికి కాంభోజమునకు పోవటానికి ముహూర్తము నిశ్చయమైంది. ఆమె చెలికత్తెగా మీ కుమార్తెను అరణంగా పంపడానికి నిశ్చయించారు" అని వార్తాహరుడు వివరించాడు.

మయూరాకారంలో ఉన్న పల్లకీలో రాజదుహిత ముందు సాగిపోతున్నది. నలుమూలలు పీతాంబరాలతో కప్పి ఉన్నాయి. సాయుధులైన భటులు అప్రమత్తులై నలుమూలలా

రక్షిస్తున్నారు. దాని వెనుక మాధవి పల్లకి సాగిపోతున్నది. ఆమె నేత్రాల్లో ఒక్క కన్నీటి బొట్టైనా లేదు. సూర్యాతపంలో ఎడారినుంచి వచ్చే తళుకొక్కటి మాత్రం ఆమె కనుకొనుకలనుంచి మెరిసింది.

దారిపక్క ఆచార్యుని దేహం చైతన్యరహితమై శుష్కమైన వృక్షశాఖవలె పడిఉన్నది. ఆతని ప్రక్క కుమారసేనుడు నిశ్చలుడై నిలబడి ఉన్నాడు. అరణ్యంలో పక్షులు గానం చేస్తున్నాయి. వాయుదేవుడు మామిడిపూత సుగంధంతో మిళితమైన సౌరభాన్ని వెదచల్లుతున్నాడు.

—*Tagore*: '*The last song*'

# 15. ప్రతిఫలం

ఖజానాలో దొంగతనం జరిగింది. "దొంగను వెదకి పట్టండి. లేకపోతే నగరరక్షకాధికారి శిరస్సు దానికి పరిహారం కాగలదు" అన్న రాజశాసనానికి భయకంపితులై నగర రక్షకులు నలుమూలలా నేరస్థునికోసం గాలించటం మొదలు పెట్టారు. నగరపరిసరాల్లో ఒక జీర్ణ దేవాలయంలో ఒక దేశాంతరుడు నిద్రిస్తున్నాడు. అతడు అశ్వాల విక్రయానికి స్వదేశం విడిచి వచ్చాడు. పాపం! చోరులు అతని సర్వస్వం దోచుకున్నారు. చేసేదిలేక పుట్టెడు దుఃఖంతో అతడు స్వదేశానికి తిరిగి వెడుతున్నాడు. నిరాశ్రయుడైన ఆ పరదేశి రక్షక భటుల కంట బడ్డాడు. నేరస్థుణ్ణి పట్టుకున్నట్టు సంతృప్తిపడి వారతని కాళ్ళకు, చేతులకు సంకెళ్ళు తగిలించి రాజమార్గం వెంట తీసుకొని పోతున్నారు.

అతిలోక సౌందర్యవతియైన శ్యామ తన సౌధ వాతాయనంలో నుంచి వీధివెంట వచ్చిపోయేవారిని చూస్తున్నది. ఒక్కసారి చకితయైంది. ఆమెకు వళ్ళంతా జలదరించింది. 'అయ్యో! పాపం సామాన్యచోరునివలె బంధించి తీసుకొని వెళు

తున్న ఆ దేవతా స్వరూపుడెవరు?' అనుకొని వెంటనే చెలికత్తెను పిలిచింది. "త్వరగా వీధిలోకి వెళ్ళి రక్షక భటాధికారితో 'మిమ్మల్ని బందీతోసహా ఒకసారి తన గృహానికి దయచేయవలసిందిగా శ్యామ కోరుతున్నది' అని చెప్ప"మన్నది. 'శ్యామ బంధితుణ్ణి కూడా తీసుకుని రావలసింది అని ఆజ్ఞాపించింది' అన్న మాట వినగానే నగర రక్షకాధికారికి దేహం ఒక్కసారి పులకరించింది. వెంటనే అతడు లోపలికి వెళ్ళాడు. బంధితుడైన వ్రజసేనుడు సిగ్గుతో తలవంచుకొని వెంబడించాడు. రక్షకాధికారి శ్యామతో 'వేళగానివేళ ఈ పిలుపేమిటి?' అని ఉత్కంఠతో మందస్మితం చేశాడు. బంధితుడు తల ఎత్తి శ్యామతో పరుషంగా "ఈ చెలగాటం ఏమిటి ? లావణ్యమూర్తియైన నీవు అమాయకుడైన పరదేశీయుని అగౌరవాన్ని చూచి సంతోషించదలచావా? అతణ్ణి అపహాస్యం చేయడానికి లోపలికి ఆహ్వానించావా ?" అన్నాడు.

"అపరిచితుణ్ణి అపహాస్యం చేయడమా?" అని ఖేదపడ్డది శ్యామ. 'నా శరీరం మీద ఉన్న ఆభరణాలన్నీ నీకిచ్చి ఆ బంధనాలను నేను తగిలించుకుంటే ఎంత బాగుంటుంది. నీకు జరిగిన అవమానానికి, మనోవ్యథకు నా హృదయాంతరాళాల్లో ఉన్న స్పందనం నీకేమి తెలుసు' అని అనుకొని, అతనికి జరిగిన అవమానాన్ని తలవంపును లాలనతో తుడిచివేయడానికి చూస్తున్నదా అన్నట్టు శ్యామ తన విప్పారిన నేత్రాలతో అతణ్ణి చూసింది. తరువాత అధికారివైపు తిరిగి "నాకు ఉన్నదంతా తీసుకొని ఈ బంధితుణ్ణి వదిలివేయి" అన్నది. "ఓ అందాల రాశీ! నీవు చెప్పినట్టు చేయడానికి నేను అసహాయుణ్ణి. రాచనగరులోని చౌర్యానికి ఒక జీవి ప్రాణం ఆహుతి అయితేనేకాని

రాజుగారి క్రోధాగ్ని చల్లారదు" అన్నాడు రక్షకాధికారి. దుఃఖిత యైన శ్యామ అతని రెండు చేతులూ పట్టుకుని 'ఈ బందీని రెండు రాత్రింబవళ్ళు మాత్రం బ్రతుకనివ్వండి' అని ప్రార్థించింది. అధికారి సరే అని సమ్మతించి వెళ్ళిపోయినాడు.

రెండవనాటి రాత్రి చెఱసాల తలుపులు తెరుచుకుని దివిటీపట్టుకుని ఒక స్త్రీ ప్రవేశించింది. ఆనాటి వేకువన ఉరిశిక్ష పొందవలసిన వ్రజసేనుడు ప్రార్థనలో మునిగి ఉండగా ఆవిడ అతని దరిజేరింది. ఆమె చేసిన సౌజ్ఞకు బదులుగా కావలివాడు అతిత్వరితగతిని అతని బంధనాలను తొలిగించాడు. బందీ తలెత్తి చూశాడు. ఆ శరదిందుముఖిని చూసి ఆశ్చర్యపోయాడు. అతడు మాటాడుతుండగా గొంతు బొంగురుపోయింది "నాజీవి తాంధకారంలోకి ఉషస్సువలె ప్రవేశించావు. భయంకర కాళ రాత్రికి వేగుచుక్కవలె ఉన్నావు. మరణాసన్నుడైన వ్యక్తికి జీవజ్యోతివీ, వినాశం చెందేవానికి ముక్తిప్రదవూ అయిన నీ వెవరవు? క్రౌర్య కౌటిల్య భూయిష్ఠమైన ఈ నగరంలో దయా స్వరూపిణివైన నీవెవరు?" అన్నాడు.

"నేనా? దయాస్వరూపిణినా?" అని పకపక నవ్వింది. ఆ నవ్వు చెఱసాలలో ఉన్న వారందరికీ మేల్కొలుపైంది. వెఱ్ఱి వెఱ్ఱిగా నవ్వుతూ ఒక్కసారి అజ్ఞాతమైన బాధాపీడితమైన నిట్టూర్పుతో కన్నీరు కార్చింది. "నగరవీధుల్లో ఉన్న శిల లన్నియు రాశీభూతమైనప్పటికీ శ్యామ హృదయ కాఠిన్యంతో తులతూగవు" అని తన్నుదాను స్థిమితపరచుకుని బందీ చేతిని గట్టిగా పట్టుకుని అతనిని కారాగారంనుంచి బయటకు తీసుకొని పోయింది.

నదిదగ్గర తెల్లవారింది. ఒడ్డున ఒక నావ లంగరువేసి ఉన్నది. 'అపరిచితుడా రా!' అని పిలుస్తూ ఆమె నావఎక్కింది. "ప్రియా! రా! పూర్వబంధాలన్నీ తెగదెంచుకుని ఇప్పుడు నీ జీవితంతో ముడివేస్తున్నాను. నా ప్రియుడివి స్వామివి అయిన నీతో తెలియని పథాలకు ప్రయాణం సాగిస్తున్నాను" అన్నది.

నావ సాగిపోయింది. నదిఒడ్డునఉన్న అడవిలో పక్షులన్నీ ఆనందంతో కిలకిలారావం చేశాయి. వ్రజసేనుడు ప్రణయిని ముఖాన్ని తన హృదయానికి గట్టిగా అదుముకొని "చెప్పు నా విముక్తికై ఎంతధనాన్ని వెచ్చించావు? దరిద్రుణ్ణైన నేను నీ కెంత ఋణపడిఉన్నానో తెలుసుకోడానికి కుతూహల పడు తున్నాను చెప్పు" అన్నాడు. అనురాగవతియైన ఆమె మరింత సన్నిహితంగాచేరి 'ఆ విషయానికిది సమయంకాదు' అని మాత్రం అన్నది.

వడిగా వీస్తున్నగాలులు, వేగంగా సాగుతున్న ప్రవాహం నావను దూరదూరంగా తీసుకుపోయాయి. మిట్ట మధ్యాహ్నం సూర్యుడు తీవ్రంగా ప్రకాశిస్తున్నాడు. ప్రశాంతత ఆవరించింది. గ్రామీణ స్త్రీలందరూ నదిలో స్నానంచేసి పాత్ర లను నీళ్ళతో నింపుకొని రొండిని పెట్టుకుని నీళ్ళుకారే చీర లతో ఇంటికి చేరుకున్నారు. నది ఇరువైపులా ప్రశాంతంగా ఉంది. నావ మెల్లగా మెట్లదగ్గరచేరింది. పక్షులు తమ గూళ్ళలో నిశ్శబ్దంగా పరున్నాయి. మిడతలుమటుకు రొదచేస్తున్నాయి. పంటకళ్ళాలమీది గాలి సువాసనతో రివ్వున వీచి ఆమె మేలి ముసుగును తొలిగించింది. వ్రజసేనుడు ప్రణయోన్మత్తుడై ఉద్వేగ హృదయంతో ఆమెదగ్గరచేరి "నన్ను దుర్బలాలైన

బంధాలనుంచి విడిపించావు. భేదించరాని బంధాలతో నన్నిప్పుడు బంధించు" అని ఆమె చెవిలో ఊదాడు. "మధుర మయీ! ఇప్పుడు చెప్పు, అద్భుతమైన నా విముక్తిని ఎలా సాధించావో చెప్పు. ఆ ఋణాన్ని ఈ జీవితంతోనే యథార్థానికి నీదైన ఈ జీవితంతోనే తీర్చుకుంటాను" అన్నాడు. కాని ఆమె మేలి ముసుగు తొలిగించుకుని "ఇంకా దానికి సమయంరాలేదు" అన్నది.

సూర్యుడ స్తమించి చీకటి రాగానే నావ మళ్ళీ ఆగింది. పంచమి జ్యోత్స్న నదిలో ప్రతిఫలిస్తున్నది. కీచురాళ్ళధ్వనితో నదీతటాలు భయంకరంగా ఉన్నాయి. శ్యామ యువకుని వక్షం మీద వాలింది. నల్లని ఆమె శిరోజాలు అతణ్ణి కప్పివేశాయి. ఆమె దీర్ఘంగా నిశ్వసిస్తున్నది. అప్పుడు శ్యామ ఈ విధంగా అన్నది. "నిన్ను రక్షించటానికి నేనొక కఠోరమైన కార్యం చేయవలసి వచ్చింది. దానిగురించి నీకు చెప్పటం అంతకంటె దారుణం. కథ విన్నతరవాత నీ మనోఫలకం నుంచి దాన్ని తుడిచివేయి. కోడె ప్రాయంలో ఉన్న ఉత్తీయుడు నాపట్ల ప్రణయంలో మునిగి తేలుతుండేవాడు. నా ఆదేశం మీద నీనిందను అతడు నెత్తిపై వేసుకున్నాడు. తన ప్రాణాన్ని అర్పించాడు. అది నాకు సిగ్గుచేటుకాదు! కీర్తిపతాక! ఎందుకని అంటావా? అది నా స్వామికోసమై నేను చేసిన ఒక అమానుషకృత్యం."

శాంత గంభీరమైన అరణ్యాలు పక్షులకు నిద్రాభంగం లేకుండా కాపాడుతున్నాయి. అంధకారపటలం నది నంతటినీ ఆవరించింది. అంతవరకు ఆమెను లాలిస్తున్న చేతులు రెండూ సడలి క్రిందకు వాలిపోయినాయి. వజ్రసేనునిలో తలవని తలం

పుగా కాఠిన్యం ప్రవేశించింది. అతడు శిలాసదృశుడైనాడు. శ్యామ తెగిన తీగలా సంభ్రమంతో అతని పాదాలమీద వాలింది. చేతులతో అతని రెండుపాదాలు గట్టిగా పట్టుకుని "క్షమాభిక్ష ప్రసాదించు. ఈశ్వరుని శిక్ష నా మీద రానిమ్ముకాని నాస్వామి నన్ను క్షమించుగాక!" అని ప్రార్థించింది. వ్రజసేనుడు ఆమె పట్టు వదిలించుకున్నాడు. కళ్ళు జ్యోతులైనాయి. "బంధకీ! ఈ దీనుని ప్రాణాన్ని అంత అమూల్యమైన ప్రాణబలితో ఎందుకు రక్షించావు? రక్షించి దానిని నోటవచింపరాని నేరంతో కలుషితం చేశావు. నా ప్రతిఉచ్ఛ్వాస నిశ్వాసము నీకు ఋణ పడి ఉండటంచేత కలుషితమైంది. నీ పాపఫలితంగా నా జీవితం ప్రతిక్షణమూ శాపంగా పరిణమించింది."

అతడు దిగ్గునలేచి కాళ్ళకింది ఎండుటాకులు అంధకారపు నిశ్శబ్దతను భంగపరచగా చరచరానడిచి అడవిలోకి వెళ్ళి పోయాడు. వాయుసంచారంలేని కీకారణ్యంలో ఓషధుల గంధం ఘాటుగా ఉంది. ఎత్తైన వృక్షాలు ఆ గాఢాంధకారంలో రకరకాల ఆకారాలు ధరిస్తున్నాయి. బాటసారులను ముందుకు పోవద్దని హెచ్చరిస్తున్నట్టు దారికడ్డంగా గోడవలె తీగలు దట్టంగా అల్లుకుని ఉన్నాయి. తాటితో లాగినట్లు అతడు కూల బడ్డాడు.అతని వెనకాల కేవలం నీడవలె ఒకవ్యక్తి నిలబడి ఉన్నది. ఆ స్త్రీ కంటకమయిన సుదీర్ఘమైన మార్గాన పాదాలు చీరుకొని పోయి రక్తధారలుకారగా అతణ్ణి అనుగమించింది. ఆవిడ వెనక ఉన్నట్లు అతడు ఇప్పుడు గమనించాడు. పిడికిలి బిగించాడు. కంఠం రుద్ధమైంది. "నన్ను ఒంటరిగా వదలిపెట్టవా ?" అన్నాడు. మరుక్షణంలో ఆమె అతణ్ణి వరదలా చుట్టుముట్టింది. ఆమె అవయవాలతో, శిరోజాలతో, స్పర్శతో, చుంబనాలతో

అతడు ఉక్కిరి బిక్కిరియైనాడు. ఆమె దీర్ఘనిశ్వాసంతో "నన్ను వదలి పోనీయను. నీ చేతులతో నన్ను శిక్షించు, బాధించు. ఆ విధంగా పగదీర్చుకో. కాని నిన్ను వదలిపోనీయను" అని ప్రార్థించింది.

గొంతు పిసికినప్పటి కెవ్వుమన్న కేకకు ఘూనభోంత రాళాలు భయకంపితాలైనాయి. ఒక మూర్తి నిట్టనిలువునా నేలబడి చైతన్యరహితమైంది.

వజ్రసేనుడు నదీతీరానికి వచ్చేటప్పటికి సూర్యోదయమైంది. సూర్యకాంతిలో ఒక దేవాలయంలోని త్రిశూలం మెరిసింది. వజ్రసేనుడు ఏకాంతంలో ఆ ఇసుకమీద ఉన్మత్తునివలె వ్రాలాడు. జీవితం శూన్యంగాతోచి తీక్ష్ణమైన ఎండను కూడా లక్ష్యంచేయక అలాగే కూర్చున్నాడు. దారినపోయే స్త్రీలు విస్తుపోతూ 'దిక్కులేని వానివలె ఉన్నావు ఎవరు నీవు? మా పంచకు వచ్చి సేద దీర్చుకో' అన్నారు. అతడు బదులు పలకలేదు. గొంతు ఎండి నాలుక పిడుచకట్టింది. కాని నదిలో నీళ్ళు ముట్టలేదు. చివరకు సూర్యాస్తమయం అయిన తరవాత లేచి నావదగ్గరకు తక్కుతూ తారుతూ నడిచాడు. దాని దగ్గరకుజేరి అగ్నికి ఆకర్షింపబడిన శలభంలా అందులో ప్రవేశించాడు. పక్కమీద పరిత్యక్తమైన ఒక కాలి అందె పడి ఉంది. దాన్ని తన హృదయానికి అద్దుకున్నాడు. అందలి గంటల ధ్వనులు నూరుబాకులవలె అన్నివైపులా అతనిని పొడిచినట్లనిపించింది. పక్కకొక మూల నీలిచీర కుప్పబడిఉన్నది. ఆ మెత్తటి దుకూలాన్ని ముఖానికి అద్దుకున్నాడు. ప్రతి ఉచ్ఛ్వాసంలోనూ అది అలంకరించిన శరీర సౌరభాన్ని ఆస్వా

దించాడు. ఆమె మధుర జీవితంతో సంతృప్తిచెందినట్లు తోచ లేదు. పంచమి చంద్రుడు ఆకాశంలో ఒదిగి ఉన్నాడు. వ్రజ సేనుడు అరణ్యాలవంక చూసి తన చేతులు రెండూచాపి రుద్ధ కంఠంతో "ప్రియా! ఓ ప్రియా!"అని అరిచాడు. ఆ అడవి నీడ ల్లోంచి ఒక సాంద్రమైన నీడ బయటికి వచ్చింది. 'తిరిగి రా ప్రియా రా' అని అతడన్నాడు. ఆ నీడ స్థూలంగా గోచ రించింది. ఆ స్త్రీ వ్రజసేనుడి పాదాలమీద వాలింది. 'స్వామీ! ఇంకా జీవించి ఉన్నందుకు నన్ను క్షమించు.శిక్షించిన నీ హస్తం ఇంకా కఠినంగాలేదు.' అన్నది. అతని చూపు ఆమెను ఆకర్షిం చింది. ఆ ఆకర్షణలో అతని చేతులు ఆమెవైపు మొగ్గినాయి. కాని ఒక విసురులో ఆపివేశాడు. దూరంగా జరిగాడు. 'నీవు ఎందుకు తిరిగివచ్చావు? ఎందుకు?' అన్నాడు. అతని చేతిలో ఉన్న శాలి అంచె చుర్రున మండినట్లైంది. దాన్ని వదిలేశాడు. ఆ నీలిచీరను అవతల విసిరివేశాడు. అతడు శుష్కంగా 'వెళ్ళు! నన్ను శాశ్వతంగా వదలివెళ్ళు' అన్నాడు. ఆమె స్తంభించి పోయింది. తలవంచి పాదాలకు చివరిసారిగా నమస్కరించింది. లేచి నదీతీరంవెంట అడవిలోకి నడచిపోయింది. నిద్రలేచిన తర వాత కరగిపోయే కలవలె ఆమె వెళ్ళిపోయింది.

— *Tagore*: '*Retribution.*'

# 16. మోక్షం

నిర్జనారణ్యమధ్యంలో కఠోరదీక్షతో అతడు సమాధి నిష్ఠుడై నాడు. మానవులు కూడా అమరత్వంపొందే హక్కు సంపాదించాలనీ, దేవతాస్వరూపులు కావాలనీ అతని ఆశయాలు.

ఆ అరణ్యం సరిహద్దుల్లో అరణ్యాకసుల చిన్నది ఒక తె ఉన్నది. దోసిళ్ళతో ఫలాలు తెచ్చి అతనికి సమర్పించాలనీ నదీ జలాలు తెచ్చిపెట్టాలనీ ఆమె కాంక్షించి అలా చేస్తుండేది.

కాని కొంతకాలానికి అతని తపస్సు కఠినతరమైంది. బాలిక తెచ్చే పండ్లను కూడా నిరాకరించాడు. అతని పాదాల దగ్గర అవి పడిఉంటే పక్షులు వాటిని కొట్టివేస్తుండేవి. ఆకు దొన్నెలతో తెచ్చిన నీళ్ళుకూడా ముట్టుకునేవాడుకాడు.

ఆమె దుఃఖిస్తూ 'నేను చేయదగిన సపర్యలు ఏమీ లేవా? స్వామీ!' అని అడిగి చింతాక్రాంత అయింది. అనాఘ్రాతాలైన పుష్పాలు తెచ్చి ఆమె అతడిదగ్గర కుప్పలుపోసేది. కాని అతడు వాటిని కన్నెత్తికూడా చూసేవాడుకాదు.

మట్టమధ్యాహ్నం ఎండలో ఆమె అతని వెనకనిల్చొని తన పమిటకొంగుతో తీక్ష్ణాతపాన్నించి అతణ్ణి రక్షిస్తుండేది. కాని వెలుగునీడలు అతనికి ఒకేలాగున ఉండేవి.

కటికచీకటి రాత్రిళ్ళలో ఆమె నిద్రమాని అతని వంకనే చూస్తుండేది. అవసరం లేకపోయినా అతణ్ణి కాపాడుతుండేది. కాని ఆమె ఉన్నట్టు కూడా అతడు గమనించేవాడుకాడు.

పూర్వం ఆమెను చూసినప్పుడు కుశలమా? అని ప్రశ్నించేవాడు. సుఖమైనా దుఃఖమైనా ఒకటే అని ఆమె బదులు చెప్పి 'మీకు నా అన్నవారు ఎవరూ లేరా? మీ రక్షణభారం వహించడానికి తల్లిగాని అక్కచెల్లెళ్ళుగాని ఎవ్వరూ లేరా ?' అని ప్రశ్నించింది.

'కావలసినంత మంది ఉన్నారు. కాని వారు నాకేం ప్రయోజనం? వారు నాకు అమరత్వాన్ని ప్రసాదించగలరా?' అన్నాడు.

'అమరత్వం ఎందుకు? జీవితానికి అంతం ఉన్నది కాబట్టే దానికంత విలువ? ఏమంటారు?' అన్నది.

నాయీ ప్రయత్నమంతా అమరత్వానికే! నాకే కాదు మానవజాతికే అమరత్వం అందజేస్తాను అని అతడేమో అర్థోక్తులు పలికాడు. అతడు చెప్పింది ఆమెకు ఏమీ అర్థంకాలేదు. కాని అర్థంకాని ఒక వింతఆరాటాన్ని మాత్రం పొందింది. ఆమె పురి విప్పి నాట్యమాడడానికి కాంక్షించే నెమలి మేఘగర్జనకు ఎదురు చూస్తున్నట్లు ఉండేది.

కాలం గడిచింది. ఆ నిస్సంగుడు సంభాషణ గూడా మానేశాడు. నిత్యం వచ్చిపోతున్న వనబాలను కన్నెత్తిఅయినా చూడడంలేదు. పల్లెత్తి పలకరించడంలేదు.

వారిద్దరిమధ్య ఉన్న అంతరం వేలకొలదిమైళ్ళ దూరం

ఉన్నట్టు ఆమె భావించింది. వేలకొలది సంవత్సరాలున్నా తాము సన్నిహితులం కాలేమని ఆమె భావించింది. ఒక్కసారిగా మాయ తొలగినట్లైంది. ఆమె కంఠం రుద్ధమైంది. 'రోజు అంతటిలో నాతో ఒక్క పలుకు పలికిన చాలదా? రోజంతా నాకు తృప్తి కరంగా ఉండేది. నా చేతిపండు ఒక్కటి గ్రహిస్తే చాలదా? నాకుభోజనం అమృతతుల్యం అయ్యేది' అని ఆమె పరితపించేది.

మునీశ్వరుడి వ్రతదీక్ష దేవతల చెవులబడింది. మర్త్యుడైన మానవుడు స్వర్గం చేరదలచాడా? ఎంతటిసాహసం! ఎంతటి గర్వాతిరేకం!

స్వర్గాధిపతియైన దేవేంద్రుడు క్రోధోద్రిక్తుడైనాడు. హృదయం సంక్షుభితమైంది. 'భుజబలంతో స్వర్గాన్ని ఆక్రమించడానికి ఉద్యుక్తులైన రాక్షసులను మనం బలపరాక్రమం చేత జయించగలిగాము. కాని ఇప్పుడు మానవుడు తన ఆత్మ బలిదానంతో స్వర్గాన్ని సాధించదలచాడు. మనం లొంగిపోవలసిందేనా?' అని చింతాక్రాంతుడైనాడు.

దేవవేశ్య అయిన మేనకకు కబురంపాడు. 'భూలోకానికి వెళ్ళి నీ సౌందర్యప్రదర్శనంతో ఆ బాలయోగి తపోభంగం చెయ్యాలి' అన్నాడు.

'ప్రభూ! అల్పుడైన మర్త్యుణ్ణి నిర్జించడానికి దేవలోకంలో ఉన్న సాధనా లుపయోగిస్తే అవి స్వర్గానికే పరాజయమేమో? మారణాస్త్రం మానవస్త్రీలలో మాత్రం లేదా?' అన్నది. ఇంద్రుడు విషయాన్ని గ్రహించాడు.

వసంతంలో దక్షిణానిలం మాధవీలతను సర్వాంగ సుంద

రంగా పుష్పభరితం చేసింది. మంత్రమోహనమైన ఆ మలయ మారుతం వనబాలనుకూడా నూత్న యౌవనగా మార్చింది. మకరందపాన కుతూహలాలైన తుమ్మెదల మోస్తరుగా ఆమె మనోభావాలు చంచలాలైనాయి.

అప్పుడే మౌనికి దీక్షావసానమైంది. కఠినతమమైన దీక్ష కోసం అతడు కీకారణ్య మధ్యంలో మరో పర్వతగుహకు ప్రయాణం కావడానికి కన్ను తెరిచాడు.

అతని యెదట వనబాల ప్రత్యక్షమైంది. పుష్పాలంకృత మైన కేశపాశంతో, వస్త్రాలంకరణంతో ఆమె మెఱసి పోతు న్నది. గుర్తించీ గుర్తించరాని స్థితిలో ఉన్నది. గుర్తుకురాని పూర్వగీతంలా ఉన్నది. ఎన్నడో రేఖామాత్రంగా గీసి వదలి వేసిన చిత్రాన్ని చిత్రలేఖకుడు తిరిగి తీసుకొని రంగులు చిత్రించ డానికి ఉద్యుక్తుడైనట్టు ఉన్నది.

యోగీశ్వరుడు లేచి 'ఈ అరణ్యాం విడిచిపోవా' లన్నాడు. 'ఎందుకు స్వామీ' అన్నది బాలిక. 'నా తపఃపూర్తికి' అన్నాడు.

ఆమె రెండుచేతులు జోడించి 'మీ సందర్శనానికి కూడా నోచుకో లేదా?' అన్నది.

యతీశ్వరుడు ఆసీనుడై యోచనా నిమగ్నుడైనాడు. ఆమె కోరికను మన్నించాడు. ఆమె సంతృప్తిచెందడానికి బదులు బాధాక్రాంతమైంది. ఆమె దీర్ఘాలోచనలో పడ్డది. 'నేనెంతటి దాన్ని? మోక్షకాంక్షియైన ఆయన మార్గాన్ని అడ్డగించడానికి నేనెవతె' నన్నదే ఆమెను శూలంలా వేధించసాగింది. దీర్ఘ రాత్రి అంతా ఆమె పత్రశయ్యమీద వేగిపోయింది. తనకుతానే భయ పడడం మొదలు పెట్టింది.

మరునాడు ఫలాలు సమర్పించడానికి వనబాల యోగి

యెదట ప్రత్యక్షమైంది. అతడు ఆమె తెచ్చిన ఫలాలు పుచ్చుకొన్నాడు. పత్రపాత్రలో తెచ్చిన జలాన్ని ఆప్యాయంగా తీసుకొన్నాడు. ఆనందం ఆమెకు తలమునకలైంది.

కాని మరుక్షణంలోనే వనబాల నదీతటంలో వృక్షచ్ఛాయలో కూర్చొన్నది. ఎడతెగకుండా కన్నీరు కార్చడం మొదలుపెట్టింది. ఎంత ప్రయత్నించినా నిగ్రహించుకోలేక పోయింది. అలాంటి దైన్యస్థితిలో తానెందుకున్నదో ఆమెకే అర్థంకాలేదు!

తిరిగి సన్న్యాసిని సమీపించింది. పాదాభివందనం జేసి 'స్వామీ! మీ శుభాశీస్సు లర్థిస్తున్నాను' అన్నది-

'ఎందుకు'?

'దూరదేశం పోతున్నాను'

'పోయిరా! అభీష్టసిద్ధిరస్తు' అని ఆశీర్వదించాడు.

చివరకాతని తపస్సు పూర్తైంది. ఇంద్రుడు ప్రత్యక్షమై 'నువ్వే జయించావు. స్వర్గానికి అర్హుడవైనావు' అన్నాడు.

'అయినా నాకికవద్దు' అని మౌని అన్నాడు.

'అయితే నీవుకోరే దేమిటి?'

'నాకా వనబాలిక కావాలి' అని యోగి జవాబిచ్చాడు!

—*Tagore: 'Attainment'*

# 17. శ్రామిక స్వర్గం

ప్రతీదీ ప్రయోజనకారిగా ఉండాలన్న మాటలో అతనికి నమ్మకం లేదు.

ఉపయోగించే పని ఏదీకాకపోవడంవల్ల అతడు పిచ్చి పోకిళ్లు పోతుండేవాడు. చిన్నకర్రపుల్లలతో అతడు చిన్నచిన్న పురుషుల్ని, స్త్రీలను, కోటలను తయారుచేస్తుండేవాడు. మట్టితో వింతవస్తువులు తయారుచేసి వాటిమీద ఆలుచిప్పలు అతుకుతుండేవాడు. రంగులు చిత్రించేవాడు. ఈ విధంగా అనవసరాలు నిరుపయోగాలు అయిన పనులతో అతడు తన కాలాన్ని వృథాగా వ్యయంచేస్తుండేవాడు. ప్రజలంతా అతణ్ణి చూసి హేళనచేసేవాళ్లు. ఒక్కొక్కసారి తన పిచ్చిపోకిళ్లకు స్వస్తిచెప్పాలనుకునేవాడు. కాని అవి మనస్సులో అతణ్ణి వదిలి పెట్టేవికావు.

కొందరు విద్యార్థులు పుస్తకాలు మడతవిప్పకుండానే పరీక్షలో విజయం పొందుతారు. అలాంటిదే ఇతనికీ జరిగింది. ఇతడు తన జీవితాన్నంతా నిష్ప్రయోజనంగానే గడిపాడు. అయినా అతనికి మరణానంతరం స్వర్గ ద్వారాలు తెరుచుకొన్నాయి.

స్వర్గంలో కూడా కాలపురుషుడు లెక్కలు వ్రాస్తూనే

ఉంటాడు. తన అధీనంలో ఉంచుకొన్న వ్యోమభృత్యు డితణ్ణి పొరబాటున శ్రామికస్వర్గానికి తీసికొని వెళ్ళి అక్కడ ఉండ వలసిందిగా చెప్పాడు.

ఈ స్వర్గంలో విశ్రాంతి అనేది తప్ప అన్నీ లభ్యమౌ తాయి. ఇక్కడి పురుషులు 'భగవంతుడా ఒక్కక్షణం గూడా తీరిక లే'దంటారు. స్త్రీలు 'కాలం త్వరత్వరగా అయిపోతున్నది. పదండి పదండి' అంటారు. అక్కడ అందరూ 'కాలం అమూల్య మైంది! చేతినిండా పని ఉన్నది! ఒక ఘడియనుకూడా పోగొట్టుకోగూడదు!' అంటూ ఉంటారు. అయినా వారు ఆనందంగానే ఉన్నారు. ఉత్కృష్టపథంలోనే ఉన్నారు.

భూలోకంలో ప్రయోజనకరమైన పని ఏదీ చెయ్యకుండా జీవితాన్ని గడిపిన నూతన ఆగంతకునికి ఈ శ్రామిక స్వర్గం సరి పడ్డదికాదు. అతడు దారినపోయేవారిని తోసుకుంటూ వీధుల వెంట శూన్యంగా తిరిగాడు. అతడు పచ్చిక బయళ్లలోనో, నిశ్శబ్దంగా ప్రవహించే సెలయేళ్ళ పక్కనో తిరుగుతూ పనిలో నిమగ్నులైయున్న కృషీవలుల నిందలకు పాలయ్యేవాడు. అతడు ఎప్పుడూ ఇతరులపనికి అడ్డువస్తుండేవాడు.

పనిలో నిమగ్నురాలైన ఒక బాలిక నిత్యం ఒక నిశ్శబ్ద మైన సెలయేటికి (శ్రామిక స్వర్గంలో సెలయేళ్లు కూడా ధ్వని చేసి అలసట తెచ్చుకోవు) కుండతో నీళ్ళు నింపుకోడానికి పోతుండేది.

వీణమీద అనుభవజ్ఞుడైన వైణికుని చేతివేళ్ల నడకవలె ఆమె త్వరితగతిని వెళ్ళేది. తలకూడా తిన్నగా దువ్వుకొనేది కాదు. ద్విరేఫాలు ఆమెకళ్ళలోని నీలిమను చూడాలన్న కాంక్షతో ఆమె ముఖంమీద మాటిమాటికి వాలుతుండేవి.

సెలయేటి పక్కనే సోమరి నిలుచున్నాడు. ఒంటరిగా ఉన్న భిక్షుకుణ్ణి చూసి రాణి జాలిపడ్డట్టు బాలిక ఇతణ్ణి చూసి జాలిపడ్డది.

'ఇదిగో! నీకు చేతిలో ఏమీపనిలేదల్లే ఉన్నది. అవునా?' అన్నది.

అతడు ఒక పెద్ద నిట్టూర్పు విడిచి 'పనా! పనిచేయడానికి నాకు ఒక్క క్షణంకూడా తీరికలేదు!' అన్నాడు. అతని మాటలు ఆ బాలికకు అర్థంకాలేదు. 'కావాలంటే నీకు కొంత పని చూపిస్తాను' అన్నది.

అప్పుడతడు 'సెలయేటి పక్కనున్న ఓ చిన్నదానా నీ దగ్గరనుండి పనితీసుకోడానికే నేనిక్కడ ఉన్నాను' అన్నాడు.

'నీకు ఏ పనంటే ఇష్టం' అన్నది. 'వీలుగా ఉంటే నీ జలపాత్రనొకదాన్ని ఇస్తావా' అన్నాడు. 'జలపాత్రా! ఎందుకు సెలయేటినుంచి నీళ్ళుతెస్తావా?' అని ఆమె అడిగింది. 'కాదు! నేను నీ జలపాత్రమీద బొమ్మలువేస్తాను' అన్నాడు. బాలికకు ఈ మాటలు చికాకు కలిగించాయి. 'బొమ్మలా! నీవలె కాలం వృధాచెయ్యడానికి నాకు వీలులేదు బాబూ! నేను వెడుతున్నాను' అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.

పనిలేని వాళ్ళతో పనిఉన్నవాళ్ళు పోటీపడి ఎలా గెలుస్తారు? రోజూ ఆ అమ్మాయి నీళ్ళకు వచ్చేది. అతడు రోజూ 'ఓ సెలయేటి సుందరీ! నాకు జలపాత్ర ఇస్తే దానిమీద బొమ్మలువేస్తాను' అని అంటుండేవాడు.

చివరకు ఆమె అంగీకరించింది. తన పాత్రల్లో ఒక దాన్ని అతని కిచ్చింది. అతడు దానిమీద బొమ్మలు వేయడం

ఆరంభించాడు. గీత తరవాత గీత గీస్తూ రంగు వెంబడి రంగు వేస్తూ ఉన్నాడు.

బొమ్మల పని పూర్తి అయిన తరవాత బాలిక పాత్ర నెత్తి అటూ ఇటూ తిప్పి రెప్పవేయకుండా చూసింది. ఆమె కళ్ళు కలవరపెట్టాయి. కనుబొమ్మలు చిట్లించి 'ఈ గీతలూ రంగులూ వీటి అర్థమేమిటి? వాటి ప్రయోజనం ఏమిటి?' అని అడిగింది.

అతడు పగలబడి నవ్వాడు. 'ఏమీలేదు! బొమ్మలకు అర్థాలూ ప్రయోజనాలూ ఉండకపోవచ్చు' అన్నాడు.

తన జలపాత్రను తీసికొని ఆమె ఇంటికి వెళ్ళింది. ఇంటి దగ్గర ఎవ్వరూ చూడకుండా దీపందగ్గర ఆ పాత్రను అటుఇటూ తిప్పి అన్నికోణాలనుంచి చూసింది. రాత్రివేళల నిద్రలో లేచి దీపం వెలిగించి మళ్ళీ ఆ పాత్రను మౌనంగా తిప్పితిప్పి చూసేది. ఆమె జీవితంలో ఇదే మొదటిసారిగా నిష్ప్రయోజనమూ, అర్థరహితమూ అయిన వస్తువును చూసింది.

మర్నాడు సెలయేటికి బయలుదేరినప్పుడు ఆమె నడకలో వడి కొంత తగ్గింది. ప్రయోజనరహితమూ, అర్థశూన్యమూ అయిన భావం ఏదో ఆమె మనస్సులో మెదిలింది.

సెలయేటి దగ్గర నిలబడిఉన్న యువకుణ్ణి చూసి కలవరపాటుతో 'నీకు నా దగ్గరనుండి ఇంకా ఏంకావాలి?' అని అడిగింది.

'నీ చేతినుంచి మరికొంతపని కావాలి' అని అతడన్నాడు.

'ఎలాంటి పని అంటే నీకిష్టం' అని ఆమె అడిగింది.

'నీ జడలోకి ఒక రంగురంగుల రిబ్బన్ తయారు చెయ్యనియ్యి' అన్నాడు.

'ఎందుకు' ?

'ఎందుకూ లేదు ! ఊరికేనే !' అన్నాడు.

రంగులతో మెరసిపోయే రిబ్బన్లు తయారుచేశాడు. శ్రామిక స్వర్గంలో ఉన్న ఆ బాలిక రోజూ రిబ్బను జడలోపెట్టి అల్లుకోడానికి కొంతకాలం వృధాగా గడపవలసి వచ్చేది. ఆ ఘడియలు నిష్ప్రయోజనంగా గడిచిపోయినై ! ఎంతో పని మిగిలిపోయింది.

తరవాత, తరవాత శ్రామిక స్వర్గంలో పని కుంటుబడ్డది. లోగడ నిముషం తీరిక అనేది లేకుండా పనిచేసే వారంతా చాలామంది చిత్రించడంలోను శిల్పంలోను నిమగ్నులై కాలం వృధాగా గడపడం సాగించారు.

పెద్దవారిలో ఆందోళన బయలుదేరింది. ఒక సభలో అంతా గుమిగూడినారు. లోగడ శ్రామిక స్వర్గంలో ఇలాటి వ్యవహారాలు ఎవరూ ఎరగరని అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు.

ఇంతలో వ్యోమభృత్యుడు వచ్చి పెద్దలకు నమస్కరించి తన దోషాన్ని వారికి నివేదించాడు. 'నేను ఈ శ్రామికస్వర్గం లోకి ఒక అనర్హుణ్ణి ప్రవేశపెట్టాను. ఇదంతా అతని దోషం' అన్నాడు.

అతణ్ణి పిలిపించారు. వస్తూఉండగానే సభలో ఉన్న పెద్దలంతా అతని విలక్షణమైన వేషాన్ని, అపురూపమైన అతని కుంచెలను రంగులనుచూసి ఇలాటివాడు శ్రామికస్వర్గానికి తగడని వెంటనే నిశ్చయించారు.

అధ్యక్షుడు కఠినంగా 'నీలాటివారి కిక్కడ స్థానం లేదు. వెంటనే దీన్నివిడిచివెళ్ళాలి' అన్నాడు. 'బ్రతుకుజీవుడా!' అని అతడు తన కుంచెను రంగులను సర్దుకొంటున్నాడు. అతడు పోబోతుండగా సెలయేటి సుందరి గబగబా వచ్చి, 'ఒక క్షణం ఆగు! నేనూ నీవెంట వస్తా'నన్నది.

'నిష్ప్రయోజనమూ, అర్థరహితమూ అయిన ఇలాంటిది శ్రామిక స్వర్గంలో ఇదివరలో ఎన్నడూ జరగలేద'ని పెద్దలు ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయినారు.

—*Tagore: 'A wrong man in worker's Paradise'*

# 18. మసకవెలుగు

పక్కయింటివారి దినచర్యను ఆతడు కిటికీలోనుంచి ప్రతి రోజూ చూస్తుండేవాడు. అది సంపూర్ణచిత్రంలో బిందువుల మోస్తరు, రేఖల మాదిరి కనబడుతుండేది. అందులో చూచి గ్రహించదగింది కొంత, ఊహాగానం చేయవలసింది కొంత ఉండేది.

వనమాలి ఒకనాడు తన పుస్తకంమీది నుంచి దృష్టి మరలించి కిటికీవైపు సారించాడు. ఇంట్లో అపరిచిత వ్యక్తులిద్దరు కనిపించారు. ఒకతె నూత్నయౌవన. ఒకరు వృద్ధాంగన.

వృద్ధురాలు కిటికీలో కూర్చొని యువతికి జడవేస్తున్నది. ఆమె మొరటుచేతులు ఆ కోమల సరోజాల్లోకి దూరాయో లేదో ఆ యువతికి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

ఒకనాడు యువతి సంధ్యాసమయంలో ఒంటరిగా గుమ్మానికెదురుగానుంచొని మసకచీకటిలో పటంకట్టినఅద్దాన్ని పరిశుభ్రంచేస్తున్నట్లు తోచింది.

కిటికీగుండా వనమాలి ఆమె నిత్యకృత్యాలను గమనిస్తుండేవాడు. ఆమె ఏదో ఒక పనిమీద డాబామీద తిరుగుతూనే ఉండేది. ఒకసారి మేజోళ్ళకు రఫ్ఫుతీసేది. మరోసారి

కుంకుడుకాయలు కొట్టేది. ఇంకోసారి స్నానానంతరం తన శిరోజాలను ఆరబెట్టుకొనేది. మరోసారి శాలువలు, రగ్గులు ఎండవేయడానికి డాబా ఎక్కేది.

మట్టమధ్యాహ్న వేళల్లో మగవాళ్ళు ఇంట్లో లేనప్పుడు ఆడవాళ్ళు నిద్రబోవడమో, పేకాడడమో జరుగుతుండేది. ఆ ఎండవేళ తాపానికి పావురాలు కూడా తలలు రెక్కల్లో దూర్చుకొని కునుకుతీస్తుండేవి.

కాని యువతి పుస్తకం ఒకటి తీసుకొని డాబాపై చేరేది. ఒక్కోసారి పమిటలో దాచి తెచ్చిన కాగితాన్ని పుస్తకంమీద పెట్టి ఏదో గిలుకుతుండేది. స్నిగ్ధమంజులాలైన శిరోజాలు వీపు మీద నాట్యవిన్యాసం చేస్తుండేవి. అంతరంగంలో ఉన్న ప్రేమ కలాపాన్ని రహస్యప్రసంగాలను అతిరమ్యంగా అందిస్తున్నయ్యా అన్నట్లు వేళ్ళు కాగితంమీద మందగమనం సాగించేవి.

ఒకనాడు ఆమె సగంవ్రాసి తరవాత కలంతో ఏవో గీతలుగీస్తూ ఆడుకొంటున్నది. గోడమీద పిట్టవాలి మామిడి టెంకను ముక్కుతో పొడుస్తున్నది. కాని నడివయస్సులో ఉన్న ఒక స్త్రీ పల్చబడిన తలవెంట్రుకలతో, విషాదరేఖలతో నిండిన ముఖంతో వచ్చి యువతిచేతిలో ఉన్న అసంపూర్ణలేఖను సర్రున లాగివేసింది. ఆకస్మికంగా కారుమేఘం మునివేళ్ళమీద వచ్చి ఆనందమయమైన చంద్రరేఖను కబళించి నట్లైంది.

యువతి డాబాపైకి రావడం మానేసింది. ఏదో ప్రళయం వచ్చి ఇల్లు మూలమట్టంగా కూలిపోతున్నట్టుగా రాత్రింబగళ్ళు ఆ ఇంట్లో పెద్దపెద్దకేకలు వినబడుతుండేవి.

ఒకనాటి సాయంకాలం వనమాలి మునిమాపువేళ క్షణ మాత్రం యువతిని చూడగలిగాడు. ఆమె ఇంటిముందు నుంచొని దేవాలయంలో ఘంటారావాలు వింటున్నది. కొంత సేపటికి ఆమె సాష్టాంగనమస్కారంచేసి ధ్యానముద్రలో ఉన్నది. తరవాత ఆమె మేడదిగి వెళ్ళిపోయింది.

వనమాలి ఆమెకు ఒక లేఖ వ్రాసి ఆ రాత్రే పోస్టులో వేశాడు. కాని పక్కమీద పడుకొన్నది మొదలు ఆ జాబు ఆమెకు చేరకుండా ఉంటే బాగుండునని ప్రార్థించడం మొదలు పెట్టాడు. పొద్దున లేచిందిమొదలు అతడు కిటికీవైపు తిరగడానికైనా సాహసించలేకపోయాడు. ఆనాడే ప్రయాణం కట్టి పట్నం విడిచి పలాయితుడైనాడు. అతడెక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు!

కళాశాలలు తెరిచేనాటికి అతనికి మళ్ళీ తిరిగి రాక తప్పిందికాదు. తన కాంక్షకు కంపనానికి కారణభూతమైన పక్కయింటిని కిటికీలో నుంచి చూశాడు. అది ఏనాడో ఖాళీ అయిందని మాత్రం గ్రహించగలిగాడు.

తనరాకకోసం ఎదురుచూస్తున్న ఉత్తరాల పోగులో అపరిచితమైన ఒక అబల వ్రాసిన ఉత్తరం ఒకటి ఉన్నది. పై విలాసపు వ్రాతనుబట్టి అతడు శంకించాడు. దానిమీద ఉన్న ముద్రనుబట్టి అది పరిసరప్రాంతంనుంచే వచ్చిందని గ్రహించాడు.

వనమాలి ఆ జాబును గురించి చాలాసార్లు ఆలోచించాడు. తన హృదయంలో అస్పష్టరేఖలతో మసకమసకగా ఉన్న మానిని రూపం మోస్తరుగానే ఉల్లిపొరలాంటి కాగితంలోంచి వంకరటింకర వ్రాతలు గోచరించాయి.

క్షణమాత్రం అతడాజాబును చింపి చదువుదామనుకొన్నాడు. మరుక్షణంలో మనస్సు మార్చుకొన్నాడు. దాన్ని భద్రంగా పెట్టెలో పెట్టి తాళంవేసి దాన్ని ఎన్నడూ తెరవనని శపథం చేశాడు.

—*Tagore: 'Seen in Half light'*

# 19. గంధర్వ కన్య

రాజకుమారునికి మైనారిటీ వెళ్ళగానే దగ్గరనుంచి దూరంనుంచి కూడా పెళ్ళి సంబంధాలు రావడం మొదలు పెట్టాయి. పెళ్ళిళ్ళ రాయబారివచ్చి "బాల్హిక రాజకుమారి అందం వర్ణనాతీతం. తెల్లగులాబి మొగ్గల దండ అని చెప్పవచ్చు" అన్నాడు. రాజకుమారుడు ముఖం తిప్పుకుని జవాబే చెప్ప లేదు. మరో రాజబంధువువచ్చి 'గాంధార రాజకుమారి అందం వర్ణనాతీతం. సౌకుమార్యంలోనూ, సౌందర్యంలోనూ ఆమె ఒక పండిన ద్రాక్షపళ్ల గుత్తిలాంటిది' అన్నాడు. రాజకుమారుడు వేట విషయంమీద అడవికి వెళ్ళి చాలా సేపటికిగాని రాలేదు. దర్బారులోని సభికుడొకడు "కాంభోజరాజ కనిష్ఠ పుత్రి లావణ్యం చెప్పనలవికాదు. ఆమె కనుబొమలు ధనుస్సు వలె అందంగా వంగి ఉంటాయి. ఆమె నేత్రాలు తళతళ మెరిసే మంచు బిందువుల్లా ఉంటాయి" అన్నాడు. రాజకుమారుడు పద్యాల పుస్తకం పేజీలు తిప్పుతూ తల ఎత్తనేలేదు.

రాజుగారు 'ఏమిటిదంతా ? మంత్రికుమారుని పిలవండి' అన్నారు. మంత్రికుమారుడు వచ్చి రాజుగారి ఎదుట నిలవగానే "మీరిరువురు మిత్రులు కదా ! వివాహం అంటే రాజకుమారు

నీకీ ఎందుకిష్టంలేకుండా ఉంది. చెప్పు" అన్నారు. "అయ్యా! రాజకుమారుడు గంధర్వలోకాన్ని గురించి విన్నప్పటినుంచి తాను గంధర్వ కన్యను తప్ప పెండ్లాడనని శపథం పట్టాడు" అని అన్నాడు. ఆ గంధర్వలోకం అంటే ఏమిటో తెలుసుకోవాలని రాజు కుతూహలపడ్డాడు. జ్ఞానవృద్ధులూ, వయోవృద్ధులూ అయిన పండితులను పిలిపించాడు. వారు పుస్తకాలన్నీ తిరగేసి నివ్వెరపోయి "అయ్యా! గంధర్వలోకాన్ని గురించి ఒక్క ముక్కగూడా ఎక్కడా లేదు"అన్నారు. రాజు వర్తకులను పిలిపించాడు. వారు "అయ్యా! మేమెన్నో సముద్రాలు దాటాం. ఎన్నో భూములు దాటాం. మేము మిరియాలకోసం సుగంధ ద్వీపాలకు వెళ్లాం. చందనంకోసం మలయా వెళ్లాం. కాని మేమెక్కడా గంధర్వలోకం గురించి వినలేదు" అన్నారు.

రాజుగారు మంత్రికుమారుణ్ణి పిలిపించారు. "గంధర్వలోకాన్ని గురించి రాజకుమారుడికి ఎవరు చెప్పారు?" అని అడిగాడు. "దేశద్రిమ్మరియైన ఒక పిచ్చివాడు చెప్పాడు. అతడు అడవులలో వేణుగానంచేస్తూ తిరుగుతుంటాడు. వేటకు వెళ్ళిన రాజకుమారుడు గంధర్వలోకం గురించి అతని ద్వారా విన్నాడు." అని జవాబు చెప్పాడు మంత్రికుమారుడు.

రాజు దేశద్రిమ్మరిని పిలిపించాడు. అతడు అడివిపూలతో రాజదర్శనానికి దర్బారుకు వచ్చాడు. "గంధర్వ లోకాన్ని గురించి నీకు తెలిసింది చెప్పు" అన్నారు రాజుగారు. "గంధర్వలోకం మీ రాజ్యానికి ఉత్తరభాగాన చిత్రగిరి పర్వతం దగ్గర 'కామ్యక' అనే సరస్సుదగ్గర ఉన్నది" అన్నాడు దేశద్రిమ్మరి.

"అక్కడ గంధర్వులు కనబడతారా!" అని అడిగాడు రాజుగారు. "గంధర్వులను చూడవచ్చు కాని వారెవరో తెలియదు. వారు మారువేషాల్లో ఉంటారు. ఆమె వెళ్ళిపోయిన తరవాతనే ఆమె గంధర్వకన్య అని తెలుసుకోగలుగుతాడు మానవుడు. నేను ఒక్కొక్కసారి సంగీత ధ్వనినిబట్టి, కాంతిపుంజాన్ని బట్టి గంధర్వ కన్యను పోల్చుకోగలుగుతాను" అన్నాడు. రాజుగారు చికాకుతో "ఇదంతా పిచ్చి! కేవలం పిచ్చి! ఇతనిని పంపివేయండి" అన్నారు. ఇదంతా విన్న రాకుమారుడు మాత్రం దాన్ని సంపూర్ణంగా విశ్వసించాడు.

వసంతోదయమైంది. చెట్లమీదనుంచి పువ్వులు ఒకదాని మీద ఒకటి వ్రాలుతున్నాయి. వనమంతా కాంతివంతంగా ఉంది. రాజకుమారుడు గుర్రాన్ని తీసుకుని 'చిత్రగిరి' వైపు బయలు దేరాడు. ప్రజలాశ్చర్యంతో 'ఎక్కడికి వెడుతున్నారు?' అని అడిగారు. అన్యాసక్తుడైన అతడు వినిపించుకోకుండా బదులు చెప్పకుండా వెళ్ళిపోయాడు.

పర్వతంమీది సెలయేరు రొదచేస్తూ ఒక గుహలో ప్రవేశించి అక్కడినుంచి బయటకు పల్చగా స్వచ్ఛంగా ప్రవహిస్తోంది. దగ్గరలో ఉన్న ఒక నిర్మానుష్యమైన దేవాలయాన్ని రాజకుమారుడు తన నివాసము చేసుకున్నాడు. ఒక నెల గడిచింది. చెట్ల ఆకులు ముదురు రంగు తాల్చినాయి. అడివి అంతా రాలిన పూలతో నిండి ఉంది. ఒక రాత్రివేళ రాజకుమారుడు నిద్రలో ఒక ధ్వని విని లేచి కూచుని 'ఈ నాడు నా గంధర్వ కన్యను నేను చూడగలుగుతాను' అని అనుకున్నాడు. తెల్లవారి గుఱ్ఱం మీద ఎక్కి సెలయేటి వెంబడే ప్రయాణంచేసి, 'కామ్యక'

సరస్సు చేరాడు. అక్కడ సరస్సులో పద్మాల దగ్గర ఒక అరణ్యబాలిక కుండతో నీళ్ళు నింపుకుంటూ కూర్చుని ఉన్నది. ఆమె నల్లటి జుట్టులో ఒక శిరీషకుసుమం నక్షత్రంవలె మెరుస్తోంది. రాజకుమారుడు గుఱ్ఱంమీద నుంచి దూకి "ఓ గంధర్వ కన్యా! నీ తలలో ఉన్న శిరీషకుసుమం నాకిస్తావా?" అని అడిగాడు. భయము, సిగ్గు బిడియాలు అంటే ఏమిటో తెలియని ఆ పిల్ల మెడవంచి అతనివంక ఎగాదిగా చూసింది. మేఘంమీద ఉన్న మరో చిరుమబ్బులా ఆమె నల్లటి కళ్ళలో ఒక నీలిమ కనబడ్డది. తలలోనుంచి పూవుతీసి "తీసుకో ఇది నీదే" అన్నది. 'నువ్వు ఏ గంధర్వ కన్యవు?' అని రాజకుమారుడడిగాడు. ఆమె ముఖంలో ఆశ్చర్యం ప్రస్ఫుటించింది. వర్షంలా ఒక చిరునవ్వు నవ్వింది. సంగీతంవలె అది హృదయాన్ని స్పందింప చేసింది తన కలలన్నీ నిజమైనాయని ఆమెనవ్వు తనకలలోని మధురనాదమే అని భ్రమించాడు రాజకుమారుడు. అతడు గుఱ్ఱమెక్కి చెయిజాపాడు. భయంగాని, అనుమానంగాని లేకుండా అతని చెయి పుచ్చుకుని బాలిక గుఱ్ఱంమీదికి దూకింది, నీటితో నిండిన కుండను అక్కడేవదలి. రాజకుమారుడు ఆమె చెవిలో మెల్లగా "గంధర్వ రాజకన్యకా! నీ పేరుచెప్పి నీ మారు వేషాన్ని తీసివేయ్" అన్నాడు. "నా పేరు కజోరి. మా ఆరణ్యక బాలికలకు మారువేషాలుండవు" అన్నది. నిర్మానుష్యమైన దేవాలయాన్ని సమీపించగానే రాజకుమారుడు "అయితే నీ గంధర్వముఖాన్ని చూడాలి" అన్నాడు. "గంధర్వముఖమా?" అని పక్కున నవ్వింది. రాజకుమారుడు "ఈమె నవ్వులో నా కలలోని నాదము ప్రస్ఫుటించటం ముమ్మాటికీ సత్యం. ఈమె నిజంగా గంధర్వకన్యయే. ఈమె నాదే" అనుకున్నాడు.

రాజకుమారుడు గంధర్వకన్యను పెండ్లాడాడన్న వార్త రాజుకు తెలియవచ్చింది. వెంటనే రథాలను, గుఱ్ఱాలను, ఏనుగులను పంపించాడు. రాజకుమారుడు "కజోరీ! ఇవాళ నీవు నాతో రాజసౌధానికి వస్తున్నావు" అన్నాడు. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. తాను సరస్సుపక్కన వదిలిపెట్టిన నీటికుండ, తన యిల్లు, జ్ఞాపకం వచ్చాయి. తాను రాజకుమారుడివెంట వచ్చేటప్పుడు తనతండ్రి, అన్న అడవికి వేటకు వెళ్ళారు. వాళ్ళీపాటికి వచ్చి ఉంటారా? తన తల్లి అప్పుడు మగ్గంమీద తనకు పెళ్ళికానక్కకు చీరతయారుచేస్తోంది. ఇంకా నేస్తూనే ఉంటుందా! ఈ భావాలన్నీ ఆమె తలపుకు వచ్చి "నేను నీతో రాలేను" అని రాజకుమారుడితో చెప్పింది. కాని ఆ తూర్యనాదాలలో గుఱ్ఱాల డెక్కల చప్పుళ్ళలో ఆ మాట రాజకుమారునికి వినిపించలేదు.

ఆమె రాజసౌధం చేరగానే మహారాణి ఆమెవంక ఎగాదిగా చూసి నివ్వెరపోయి "ఇదెక్కడి గంధర్వకన్యరా" అని నిట్టూర్చి "ఎంత సిగ్గుచేటు" అన్నది. ఒక చెలికత్తె 'ఆ గంధర్వకన్య వేషం చూడండి' అని మెల్లిగా అన్నది. వారి నందరినీ ఊరుకోండని సౌంజ్ఞచేసి "గంధర్వకన్య మనదగ్గరకు మారువేషంలో వచ్చింది" అన్నాడు రాకుమారుడు.

రోజులు గడిచాయి. వెన్నెలరాత్రులలో రాజకుమారుడు నిద్రలేచి గంధర్వకన్య మారువేషం మార్చుకున్నదేమో అని చూస్తుండేవాడు. చెదరిన ఆమె జుట్టు దిండునలుమూలలా వ్యాపించి ఉండటం చూసేవాడు. ఇతర సామాన్య స్త్రీలవలెనే ఆమె కూడా ఉన్నట్టు తోచింది. ఆమె తన మారువేషం ఎప్పుడు మారుస్తుందా అనుకుంటుండేవాడు రాజకుమారుడు.

బంధువులు, స్నేహితులు రాజకుమారుణ్ణి హేళన చేయడం మొదలుపెట్టారు. అతనికి కోపంవచ్చేది. ఒకనాడు కజోరి పక్కమీదినుంచి లేవబోతుండగా అతడు ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని "ఈ మారువేషం విడిచి నిజస్వరూపం చూపితే గాని ఇవ్వాళ నిన్ను వదలను" అన్నాడు. ఈసారి ఆమె ముఖంలో నవ్వులేదు. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఎల్లప్పుడూ ఈ మారువేషంతో నన్ను మోసగిస్తూనే ఉంటావా కజోరి?" అనిఅడిగాడు. "కాదు రాజా కాదు. అది ముగుస్తుంది" అన్నది. "అయితే వచ్చే పూర్ణిమనాడు నీ సుందర గంధర్వముఖాన్ని అందరూ చూతురుగాక" అన్నాడు.

పూర్ణచంద్రుడు మింటిమీదికి మెల్లగా ఎగబ్రాకుతున్నాడు. రాజసౌధంలో తూర్యధ్వనులు సాగాయి. పెళ్లికుమారునివలె అలంకరించుకుని రాజకుమారుడు పూలమాలతో తన గదికి వచ్చాడు. పక్కనిండా మల్లెపూలుపరచి ఉన్నాయి. చంద్రకిరణం ఒకటి గదిలో నేలమీద పడుతోంది. కాని గంధర్వ కన్య అయిన కజోరి ఏది? ఎక్కడ? ఎక్కడాలేదు! వెళ్ళిపోయింది!

చంద్రుడు పడమటి దిక్కున అస్తమించాడు. తెలతెల వారబోతున్నది. రాజకుమారుని పడకగదినిండా రాజకుమారుడి బంధువులు మిత్రులు గుమిగూడారు. "గంధర్వ కన్య ఏమైంది?" అని అడిగారు. "గంధర్వకన్య మాయమైపోతూ నిజస్వరూపం చూపుతుంది. మించిపోయింది! అంతా మించి పోయింది!!" అని రాజకుమారుడు గొణిగాడు.

—*Tagore* - "*The Fairy reveals herself*"

# 20. సృష్టి

సృష్టి కార్యం అవసానదశలో ఉన్నది. ఇంతలో సృష్టి కర్త మనస్సులో ఒక వినూత్నభావం తొలకరి మెరుపులా మెరిసింది. అప్పుడు తన అనుచరుని చూసి "సృష్టి సంచయం తీసుకురా ఒక వినూత్న జంతువును సృష్టిస్తాను" అన్నాడు. అనుచరుడు సవినయంగా "పూజ్యులైన పితృపాదులు సృష్టి నిర్మాణ కౌతుకంలో మొసళ్ళను, పాములను, ఏనుగులను, సింహాలను సృష్టించినపుడు వాటికి ఎంతపదార్థం వెచ్చించారో గమనించలేదు. కనక ఇప్పుడు అలాంటి సృష్టికి ఉపయుక్తమైన ఘనపదార్థమంతా ఇంచుమించుగా అయిపోయింది. లఘు పదార్థం మాత్రం కావలసినంత ఉంది" అని విన్నవించాడు.

సృష్టికర్త ఒకక్షణం యోచనా నిమగ్నుడై "ఉన్న పదార్థం తీసుకురా. ఆ పైని చూచుకుందాం" అని ఆజ్ఞాపించాడు. కఠినపదార్థాన్ని తగుమాత్రం ఉపయోగించి తక్కిన దానికి మృదుపదార్థాన్ని ఉపయోగించి ఒక వింత సృష్టి చేశాడు. ఈ వింత జంతువుకు కొనలుదేరిన కొమ్ములుగాని, భయంకరమైన కోరలుగాని, వాడిగల గోళ్ళుగాని లేవు. ఉన్న దంతాలైనా ఆహారం నమలడానికేగాని కరవడానికి శక్తివంతాలు

గావు. ఈ నూతన జంతువుకు యుద్ధం అంటే ప్రీతిలేకపోయినా యుద్ధరంగానికి ఉపయుక్తాలైన జవసత్త్వాలు ప్రసాదించి జగదీశుడు దీనికి 'గుఱ్ఱం' అని పేరుపెట్టాడు.

వాయురాకాశాలు సృజించిన పదార్థాలతోనే యించుమించుగా దీన్ని గూడా సృష్టించాడు. అందుచేతనే ఆ జంతువుకు కూడా స్వేచ్ఛాజీవిగా ఉండాలన్న కోరిక కలిగింది. అందుచేత వాయువేగ మనోవేగాల్లో దిగంతాలవరకు పరుగులు పెట్టేది. తక్కిన జంతువులు పరిగెత్తడానికో కారణం ఉండేది. కాని 'గుఱ్ఱం' నిర్నిమిత్తంగా స్వాతంత్ర్యపిపాసువై ఆశాంచలాలకు పరుగెడుతుండేది. తోడి జంతువులతో పోరాట మెరుగదు. ఆహారసంపాదనకు ఇతర జంతువులమీద లంఘించదు. విసుగులేని పరుగులు మాత్రం తీస్తుంటుంది. వాయురాకాశాల వలె లఘుప్రకృతి కలిగి ఉండటంచేత అలాఉన్నదని పండితులు చెబుతుంటారు.

సృష్టికర్త తనసృష్టికి తానే సంతృప్తిచెందాడు. జంతుకోటిలో కొన్నింటికి అరణ్యాలు వనవాసంగా కల్పించాడు. కొన్నింటికి గుహలేర్పరచాడు. కాని దాని పరుగునకు మురిసిపోయి అశ్వానికొక విశాలమైన మైదానాన్ని నిర్దేశించాడు.

ఆ మైదానానికవతల మానవుడున్నాడు. తాను కల్పించుకున్న భారాలతో అతడు క్రుంగిపోతున్నాడు. అతడు అశ్వాన్ని చూడగానే ఎలాగైనా దాన్ని వశపరచుకుని తన భారాన్ని

దానిమీద వేసి తాను విముక్తి పొందవచ్చునని సంతోషించాడు. ఒకనాడు ఉరులు పన్ని దాన్ని వశంచేసుకొని దాని వీపుమీద జీను వేసి నోట కళ్ళెం తగిలించి తీసికొని వెళ్ళి సాలలో కట్టి వేశాడు.

పులి అరణ్యంలోనూ, సింహం గుహలోనూ సుఖజీవనం చేస్తున్నాయి. కాని అశ్వం తన ఆవాసమైన విశాలమైదానాన్ని పోగొట్టుకొంది. తాను ఎంతటి స్వేచ్ఛా జీవితాన్ని అభిలషించిందో అంతటి దాస్యంలో శృంఖలాబద్ధ అయింది.

జీవితం అసహ్యం అని భావించిన కొద్దీ ఉద్వేగం రెచ్చి అది తన గిట్టలతో బంధనగృహకుడ్యాలను పగల దన్నడం మొదలుపెట్టింది. కాని ఆ తన్నులు గోడలకంటె దాని గిట్టలకే హానికరాలయినాయి. కొన్నాళ్ళకు గోడల పెళ్లలు మాత్రం రాలిపడ్డాయి.

అది చూచిన యజమాని కుపితుడైనాడు. పచ్చిగడ్డి ఫలహారంపెట్టి నిత్యం మాలీసు చేయించి అత్యాదరముతో చూస్తుంటే దీనికింత కండకావరమా అని ఇంత కృతఘ్నతా అని కసిబూని కఠినచర్య తీసుకోదలచి వెనకటి కాళ్ళకు బంధాలు వేశాడు. దాంతో అది తనవశమైంది గదా అని సంతుష్టి చెందాడు.

కుమ్మడానికి కొమ్ములులేవు! చించి చెండాడడానికి గోళ్ళులేవు! కొరికి చంపడానికి పళ్ళులేవు! తన్నడానికి

మాత్రం కాళ్ళున్నాయి కాని కొరడా దెబ్బలకు భయపడి తన్నడం కూడా మానింది. ఇహ సకిలింపులు మాత్రం మిగి లాయి. ధ్యానమగ్నుడైన సృష్టికర్త ఒకనాడు దారుణమైన హయహేషలు తన ధ్యానానికి భంగం కలిగించగా కండ్లు విప్పి మైదానం వంక తేరిపార చూశాడు. దృష్టిపథంలో ఎక్కడా అశ్వంలేదు. వెంటనే మృత్యుదేవతను జూసి కుపితుడై "ఇది నీ పనే! నా హయాన్ని అపహరించావు" అన్నాడు. 'ప్రభూ! మీరెప్పుడూ నన్ననుమానిస్తారు. ఆ మానవుని గృహంవైపు దృష్టి సారించండి' అన్నది దేవత.

ప్రభువు తన చూపుమరల్చి సంకుచితమైన నాలుగు గోడలమధ్య బందీయై శల్యావశిష్టమై సకిలిస్తున్న గుఱ్ఱాన్ని చూశాడు. ఆ దృశ్యం అతనికి దుస్సహమైంది. మానవుని చూసి క్రోధోద్రిక్తుడై "దాని బంధాలు సడలించు; లేకపోతే పులివలె చీల్చి చెండాడడానికి అనువైన వాడిగోళ్ళను కోరలను దానికి ప్రసాదిస్తాను" అన్నాడు. మానవుడు బెదరుతూ "ప్రభూ! దీనికి స్వేచ్ఛావిహారం తగదు. దాని క్షేమం విచారించే సౌఖ్య ప్రదమైన అశ్వశాలను నిర్మించాను. దయచేసి చూడండి" అని విన్నవించాడు. "దాన్ని విడవక తప్పదు" అని సృష్టికర్త ఆజ్ఞాపించాడు. "మీ ఆజ్ఞను శిరసున దాలుస్తున్నాను. సువి శాలమైన మైదానముకంటె అన్ని విధాల అనుకూలమైన అశ్వ శాలయే దానికి ఉచితమైనదని కొద్దిరోజులకే తమరు తెలుసు కుంటారు" అని విన్నవించి దాని ముంగాళ్లకు బందం వేసి

విడిచిపుచ్చాడు. అందుచేత అది కప్పవలె గంతులు వేయడం ఆరంభించింది.

స్వర్గం నుంచి చూస్తున్న ప్రభువుకు గుఱ్ఱం మాత్రమే కనబడింది కాని బంధం కనపడలేదు. దాని దురవస్థనుచూచి తనలో తాను సిగ్గుపడ్డాడు. చివరకు తన సృష్టి నిర్మాణ కౌశలం ఈ విధంగా పరిణమించిందా అని నిర్వేదం పొందాడు. తన అవివేకానికి తన్ను తాను నిందించుకొన్నాడు మానవుడు. "ప్రభూ! దీన్నేమి చేయమంటారు? స్వర్గంలో విహారభూము లుంటే అక్కడకు పంపిస్తాను" అని సాకాంక్షంగా విన్నవించు కున్నాడు. "వద్దు నీ అశ్వశాలకే దీనిని తీసుకొనిపో" అన్నాడు సృష్టికర్త. "అయ్యో! నాపై ఎంతభారం వేశారు. దీన్ని ఎలా భరించడం" అని మానవుడు విన్నవించుకున్నాడు. "ఆ భార వహనంలో నీ సహృదయతను ప్రదర్శింతువుగాక!" అని సృష్టి కర్త అన్నాడు.

—*Tagore: 'The Horse'*

# 21. పిశాచం

మరణాసన్నుడైన వృద్ధుని దగ్గరజేరి ప్రజలంతా 'గురు వర్యా మీరు లేకుండా మేమంతా ఎట్లా జీవించగలుగుతాము' అని దుఃఖించారు. అది అతనికి హృదయవేదనగా ఉన్నది. 'ఔను ! నేను లేకపోతే వీరికి సుఖశాంతులేవి ? జీవనయాత్ర సుఖంగా ఎట్లా సాగుతుంది' అని ఆలోచించడం మొదలు పెట్టాడు.

జాతి వెలిబుచ్చిన ఆక్రందనం రోదసీకుహరాలు దాటి పరమేశ్వరుని చెవిని పడ్డది. ప్రజల ప్రార్థన ఆయన మన్నించి దేశంలో వృద్ధుడు పిశాచరూపంలో ఉండటానికి అనుగ్రహించి నాడు. మానవునికి మరణం ఉన్నది కాని పిశాచానికి లేదుకదా !

ఈ మహావకాశానికి జాతి అంతా శాంతి సంతోషాలు వెలిబుచ్చింది. కనపడని భవిష్యత్తును గురించి ఆలోచించినకొద్దీ హృదయానికి అంతులేని ఆవేదన తప్ప ఫలితం శూన్యం. కళ్ళకు కనపడనిదైనా గతాన్ని స్మరిస్తే హృదయానికి ఎక్కడలేని శాంతిలభిస్తుంది. యుద్ధాలు సంక్షోభాలు ఉండవు. బాధ్యతలు ఉండనే ఉండవు. ప్రస్తుత పరిస్థితి ఏది ఎట్లా ఉన్నా ఇది అంతా గతించిన దాని ఫలితమే అని అనుకోవడం మానవులకు

పరిపాటి. ఆ గతమే ఈ వర్తమానంలో పిశాచరూపంలో ఉంటుంది.

అయినప్పటికీ యువకులు కొందరు గతాన్ని విస్మరించి అభ్యుదయానికి మార్గాలు ఏవి అని తమలో తాము ఆలోచించడం మొదలు పెట్టినారు. గతాన్ని మరచిపోవద్దని పిశాచం వారి చెవులు మెలిపెట్టింది. అంతటితో వారు కిక్కురు మన కుండా ఊరుకున్నారు. పిశాచం శక్తి బలవత్తరం కదా!

మూఢమనస్కులై ప్రజలంతా కళ్ళుమూసుకొని పిశాచం ఆధ్వర్యంలో జీవితయాత్రను నిర్జీవంగా కొనసాగిస్తున్నారు. ప్రాజ్ఞులు ఈ అయోమయస్థితిని సమీక్షిస్తూ, 'పూర్వం సృష్ట్యాదిలో ప్రపంచమంతా ఇట్లాగే ఉండేది' అని చెబుతూ 'తరులతాదులు ఇంకా మూగస్థితిలో ఉన్నాయి. అవి మనకంటె నయమని' శ్లాఘించినారు.

పిశాచగ్రస్తమైన ప్రజానీకం అంతా ప్రాజ్ఞుల మాటలు ఆలకించి తమ పూర్వుల మోస్తరు తాముకూడా జీవిస్తున్నందుకు గర్వించి అంధపరంపర న్యాయంతో పూర్వ సంప్రదాయాన్ని నిలబెట్టగలిగినందుకు అమితానందం పొందింది.

దేశం ఒక కారాగృహంగా ఉన్నది. దాని గోడలు మాత్రం కంటికి కనబడటంలేదు. ఈ కారాగృహం నుంచి విముక్తిబొందే మార్గం ఒక్కరికీ తెలియడం లేదు!

పిశాచం ఆదేశానుసారంగా ఈ పీడితజాతి తన బ్రతుకును వెళ్లదీస్తున్నది. జాతికి కాయకష్టం మేలైంది. ఎందుచేతనంటే వారికి ప్రతిఘటించేశక్తి తగ్గిపోయింది. వారు కేవలం పారు

బోతులు, పిరికిపందలు అయినారు. ఆహారం, ఆరోగ్యం, వస్త్రా
దుల కొరతకేమిగాని పిశాచరాజ్యంలో శాంతిభద్రతలు అంతటా వ్యాపించి ఉన్నాయి.

కాలం గడిచింది. ఈ పైశాచిక రాజ్యంలో పూర్వాచార బద్ధమైన జాతి, యూపస్తంభాన బంధించిన మేషం మోస్తరుగా, మిథ్యా సంతృప్తజీవనం సాగిస్తున్నది.

కష్టపరంపరలారంభమైనాయి. ఈ పైశాచిక పాలన ఇతర సన్నిహిత జాతులకు ప్రాకలేకపోయింది. ఇతర దేశాలలో పురోగమనం చరచరా సాగుతున్నది. ఈ పిశాచ దాహాన్ని తీర్చడానికి చెమట బిందువునైనా రాల్చేవారు లేకుండా పోయినారు. అందుచేతనే వారు చైతన్య స్ఫూర్తితో జీవిస్తున్నారు.

విజ్ఞులైన వారు పూర్వశాస్త్రాల బూజుదులిపి పుటలు తిరగవేశారు. అన్నీ సమస్యలే! అన్నీ సందేహాలే! 'ఇది మన దోషంకాదు! మనలను పరిపాలించే పిశాచ ప్రభునిదికాదు! అదంతా ఆ సమస్యలదే! ఇదివరలో లేని ఆ సమస్యలు ఇప్పుడు ఎందుకు తలెత్తినాయి?' అని తీర్పరించినారు.

జాతి అంతా విజ్ఞులతీర్పును అంగీకరించి తృప్తిచెందింది. దోషం ఎవరిదైనా సమస్యలు తలఎత్తక తప్పడంలేదు! శీఘ్రకాలంలో సముద్రాంతరాలనుంచి అన్య జాతీయులు మిడతల దండుగా వ్యాపించి దేశాన్ని ఆక్రమించుకొని సస్యశ్యామలయైన భూమాతను నిలువుదోపిడీచేసి ఊసరక్షేత్రంగా మార్చివేశారు. వారికి దూరదృష్టి, లోకానుభవం, జవసత్త్వాలు ఉన్నాయి. కాని పిశాచగ్రస్తమైన జాతి దీనిని గమనించినట్లే లేదు! ఆ పిశాచానికి భయపడి వైదొలగినవారు కొందరు విజ్ఞు

లంతా చేరి మళ్ళీ శాస్త్రావలోడనం చేశారు. తుచ్ఛమైన ఈ విషయ వాంఛలనుంచి వైదొలగినవారే ధన్యులని తీర్పరించారు. వారి తీర్పును నెత్తిన బెట్టుకొని సామాన్యప్రజ అంతా సంతృప్తి పడ్డారు.

కాని ఈ ఊసరక్షేత్రాలకు పన్ను ఎలా చెల్లించడమా అన్న వారి మనఃక్షోభకు ఆ తీర్పులో సమాధానం లేదు!

శ్మశానవాటికలో ధూళిధూసరితమైన ఒక ప్రచండ వాయువు వీచింది. ఆకలిమంటలతోనైనా దుఃఖాశ్రువులతో నైనాసరే పన్నులు చెల్లించి మీ గౌరవం నిలబెట్టుకోవడం మీ పరమధర్మం అని, విగతజీవుని వికటాట్టహాసం మోస్తరుగా, వారికొక సందేశం వినిపించింది.

సమస్యలు రావడం మొదలుబెడితే జంటలుజంటలుగా వస్తుంటాయి. ఈ పిశాచాలపాలన అనంతంగా ఇట్లా సాగిపోవల సిందేనా అన్నది మరోసమస్య.

కాని వృద్ధపితామహులు దీన్ని సహించలేక పోయినారు. ఆ మాటే తలపెట్టవద్దు అని అన్నారు.

దుందుండుకులైన యువకులకు ఇది అసంతృప్తిని కలి గించింది. వారు బాధాసర్పదష్టులు. ఏమైనాసరే ఈ పిశాచపాల నకు స్వస్తిచెప్పవలసిందేనని వారు దృఢసంకల్పంతో ఉన్నారు.

పిశాచం తాబేదారులు మాత్రం యువకుల సంకల్పాన్ని అవహేళనచేసి చేతనైతే ఈ బంధాలను తెంపివేయండి చూద్దాం అని ధీరగంభీరులై రొమ్ములు విరిచారు.

యథార్థం ఏమిటంటే గతాన్ని మరిచిపోనూలేము! అనుస

రించనూలేము! అది జీవన్మరణాలమధ్య వ్రేలాడుతున్న పిశాచంలా ఉన్నది. అందుచేతనే దాన్ని భూతం అన్నారు. అది జీవించి ఉన్నది అని అందామా అది జాతిలో సంచలనం కలిగించలేదు! పోనీ మరణించింది అని అందామా అది జాతిని వదలిపోనూ లేదు.

పగటివేళ నోరువిప్పితే రాజాపచారమేమోనని భయకంపితులైన ఒకరిద్దరు సంధ్యాసమయంలో పిశాచాన్ని స్మరించి సాక్షాత్కరింపజేసుకొని 'స్వామీ! మీరు నిష్క్రమించే సమయం ఇంకారాలేదా?' అని ప్రశ్నించారు.

పిశాచప్రభువు ఒక వెడనవ్వునవ్వి 'మూఢులారా! మీరు నన్ను పొమ్మని చెప్పందే నేను మిమ్ముల్ను ఎలా వదలి వెళతాను' అన్నాడు.

'ప్రభూ! అట్లా స్వస్తి చెప్పటానికి మాకు చాలాభయంగా ఉన్న'దని వారు విన్నవించుకొన్నారు.

పిశాచం శుష్కహాసంతో, 'మీ భయమే నా పరిపాలనకు పునాది' అని నిష్క్రమించింది.

—*Tagore: 'The ghost'*